యము' అనునొక యిష్టియం దొకక్షత్రియుఁడు పశువుగా బం ధింపఁబడు సూచనలుండుటచే 'రాజు ఖండింపఁబడు యాగము' అను ధ్వని కూడ నగుచున్నది. రాజసూయ యాగముఁ గూర్చిన యంశములు 'శుక్లయజుర్వేదము'నందును, (11 అధ్యా.) ఋగ్వేద బ్రాహ్మణమగు 'ఐతరేయ' బ్రాహ్మణమునందును (7 పం, 3,4 అధ్యా.) విపులముగాఁ గలవు. కృష్ణయజుర్వే దశాఖాంతర్గతమగు తైత్తిరీయసంహితలో (5 కా. 6 ప్ర) అగ్నిచయనాంశములఁ దెల్పు సందర్భమున (కుంభేష్టికోపధాన, భూతేష్టికోపధానములు) అగ్నిచిదభిషేచనమునకును, రాజసూ య యాగకర్త యొక్క పునరభిషేకమునకును, సమానధర్మము లు కలవని మూడుమంత్రములలో; జెప్పబడియున్నది. అధర్వ సంహిత యందు (శౌనకశాఖ) ఒకసూక్తము (4 కా. 9సూ.) రాజసూయ యాగకర్తను గూర్చి అధ్వర్యుఁడు దేవతల కొన ర్చు ప్రార్థనము, రాజున కుపదేశించు నుపదేశములు కలవై యున్నది.

ఐతరేయబ్రాహ్మణమునందలి 'శునశ్శేపుని' గాథలతో ఋగ్వేదమునందలి (1 మం. 24 మొ, 30 సూక్తములవఱకు 97 మంత్రములు) సంబంధము కలదు. మఱియు నైతరేయ బ్రాహ్మణమునందు 'సామ, యజస్సు' అని చెప్పఁబడని రాజ సూయయాగ సంబంధమంత్రములన్నియు ఋగ్వేదము (శాకల్య సంహిత) నుండి కైకొనఁబడినవియే. శుక్లయజుస్సంహితలోని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంత్రములు చాలవఱకు స్వతంత్రోద్భవములుగానె యున్నవి.

ఇపుడు వ్రాయఁబోవు నంశములు సందర్భానుసారముగ 'శుక్లయజుస్సంహిత, ఐతరేయ బ్రాహ్మణముల'ను గ్రహించి వ్రాయఁబడుచున్నవి.

శ్రౌతసూత్రములలో 'ఆశ్వలాయన, కాత్యాయన, హిరణ్యకేశీ'సూత్రములు రాజసూయ విధానమును వివరించి యున్నవి.

---

## రాజసూయ యాగకర్త చేయవలసిన విధులు.

రాజురాజ్యమునకు నభిషిక్తుఁడై [1] ఇష్టాపూర్త' కర్మములను దప్పక చేయవలయును.

ఇష్టాపూర్తము లనఁగా, వేదధర్మనిర్వహణము ఇష్టమన బడును. వర్ణాశ్రమ ధర్మ నిర్వహణము, సభా, ప్రపా, తటాకాది, ప్రజోపయోగకర కార్యములొనర్చుట పూర్తమనఁ బడును. ఇష్టాపూర్తములం గూర్చి విద్యారణ్యభాష్యమున నిట్లు కలదు.

[2]వర్ణాశ్రమధర్మములను వేదధర్మములను గాపాడుట

---

(1) "ఇష్టాపూర్తా వపరిజ్యానిః" ఐ. బ్రా.

(2) శ్లో॥ వర్ణాశ్రమ త్రయీధర్మ ఇష్ట పూర్త మథేతరం ।
ప్రపా తటాకాది రూపం తచ్చ సర్వత్ర విద్యతే ॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇష్టము. దానికి వ్యతిరేకమైన 'ప్రపా, తటాకాది' ప్రతిష్ఠారూప మైనది. 'పూర్తముఁ'గూర్చి మఱియొకగ్రంథమున నిట్లు కలదు.

[1] 'తటాక ప్రతిష్ఠలు, సభాభవన నిర్మాణములు, దిగుడుబావులఁ ద్రవ్వించుట, దేవాలయములఁ గట్టించుట, తోఁటలు వేయించుట' అను కర్మములు 'పూర్తము' అని చెప్పఁబడును.

రాజసూయయాగకర్త పై కార్యము లొనర్చి యుండి 'ఇష్టాపూర్తము' అనుకర్మముఁ జేయవలయును.

'ఇష్టాపూర్త' హోమానంతరము రాజు 'దీక్షణీయేష్టి' అను నొక యిష్టిని జేయును. [2]

రాజు దీక్షణీయేష్టిని జేయగనే బ్రాహ్మ్యము నొంది సోమపానమునకుఁ గాక తక్కిన యంశములలో (కర్మములు చేయుటలో) దీక్షణీయేష్టికి మూఁడవనాఁడు జరుగు 'ఉదవసానీయేష్టి' ముగియునవఱకు బ్రాహ్మణుఁడుగానె యుండును. చూడుఁడు.

* "ఇష్టాపూర్త హోమ మొనర్చిన పిమ్మట రాజిట్లను

---

(1) పుష్కరిణ్య స్సభా వాపీ దేవస్యాయతనానిచ। ఆరామశ్చ విశేషేణ పూర్తంకర్మ వినిర్దిశేత్॥

(2) 'ఇష్టి' అను నొకచిన్న యాగము, లేక, చేయఁబడుమహాయజ్ఞమునకుఁ అంగయజ్ఞము.

* "బ్రహ్మ ప్రపద్యే బ్రాహ్మణోభవామి......బ్రహ్మవా ఏష ప్రపద్యతే యో యజ్ఞం ప్రపద్యతే...యజ్ఞాదువావా ఏష పునర్జాయతే యో దీక్షతే తం బ్రహ్మప్రసన్నం.—సహోదస్యాన్నేవ క్షత్రియతా మా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నాఁడు— ఓ ఋత్విక్కులారా! నేను బ్రాహ్మణు
నగుచున్నాను......అనఁగా అధ్వర్యుఁ డిట్లనును. ఎవఁ
యజ్ఞముఁ జేయుచున్నాఁడో అట్టి యీరాజు బ్రాహ్మణుఁ
చున్నాఁడు. ఈరాజు యజ్ఞము వలనఁ బునర్జన్మము నొంది
న్నాఁడు. ఎవఁడు దీక్షితుఁ డయ్యెనో వానిని బ్రాహ్మ
పొందియున్నది...అతఁడు 'ఉపవసానీయేష్టి' నొనర్చి
యత్వము నొందును.

పిమ్మట రా జిట్లనుచున్నాఁడు:—

నేను క్షత్రియుఁడ నగుచున్నాను. క్షాత్రము నొం
దును.

పిమ్మట నధ్వర్యుఁ డిట్లనును.

ఈతఁడు క్షత్రియుఁ డగును! క్షత్రమన రాష్ట్రమే
ఎవఁడు రాష్ట్రము నొందుచున్నాఁడో ఆతఁడు క్షాత్రము
దినవాఁ డగును.

దీక్షణీయేష్టి యైనపిమ్మట 'అనుబంధ్యము' అను
యొకయిష్టి చేయఁబడును. ఇందు గోవె బంధింపఁబడి
పఁబడును. ఆగోవు సాధారణముగా గొడ్డావైన (వశ) మం
ఆగోవు చూలితో నుండినయెడలఁ జేయఁబడు ప్రాయశ్చి
కర్మకలాపమును గలదు. గర్భస్థపిండమును వేఱుగఁదీసి,

ప్నోతి; "క్షత్రం ప్రపద్యే క్షత్రియో భవామి"..."క్షత్రం వా ఏష ప్ర
తే యో రాష్ట్రం ప్రపద్యతే క్షత్రం హి రాష్ట్రం.— ఐ. బ్రా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హోమ మొనర్చి తక్కినదానిని బొగ్గులతోఁ గప్పియుంచెదరు.

'అనుబంధ్యేష్టి' యైన మఱునాఁడు ఏకాహికసోమయా గము జరుగును. అనఁగా ఒక్కనాఁటితో ముగియు యజ్ఞము జరుగును. అది 'జ్యోతిష్టోమము' అనుపేరు కల దనియు' క్షత్రి యుఁడు జ్యోతిష్టోమ మొనర్చినచో బ్రాహ్మణుఁ డొనర్చు 'అగ్నిష్టోమ' యజ్ఞమనవచ్చు ననియు, ఐతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది. ఈజ్యోతిష్టోమ యాగమునందలి 'సవన, సామ, స్తోమ, శస్త్రాదుల' ప్రశంసతో మనకు నిమిత్తము లేదు.

సోమయాగమైన మఱునాఁడు పునరభిషేకమునకుఁ బూ ర్వము 'పశువిశసనము'— అందు క్షత్రియపశువు, లేక బ్రా హ్మణపశువు బంధింపఁబడుటతోఁ గూడిన 'ఉదవసానీయము' అను నొకయిష్టి జరుగును. ఐతరేయబ్రాహ్మణమునందలి శున శ్శేపుని యితిహాసము 'ఉదవసానీయేష్టి'కాలమునఁ గలిగినదియే. ఋగ్వేదముయొక్క ప్రథమమండలమునందలి శునశ్శేపసంబం ధములగు (24 మొదలు 30 వఱకు) సూక్తములు ఉదవసానీ యేష్టిలోఁ బశువుగానున్న శునశ్శేపునిచే దృష్టము లైనవియే. ధర్మజుని రాజసూయమునందును సోమయాగమైన మఱునాఁడె పునరభిషేక మిఁక జరుగు ననఁగాఁ జేయఁబడిన 'ఉదవసానీ యేష్టి' కాలముననే శిశుపాలుఁడు విశసింపఁబడె నని స్పష్టమగు చున్నది. ఉదవసానీయేష్టిలో శునశ్శేపుఁ డెట్లు బంధింపఁబడెనో యాగాథల నిట సంగ్రహముగా వ్రాయుచున్నాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హరిశ్చంద్రుని కథ.

ఇక్ష్వాకువంశంబున 'వేధసుఁడు' (పురాణములలో త్రిశంకుఁడు) అనురాజునకు హరిశ్చంద్రుఁ డనుపుత్రుఁడు కలఁడు. ఆ హరిశ్చంద్రునకు నూర్వురు భార్యలుండినను పుత్రసంతతి లేకుండెను.

ఆ హరిశ్చంద్రుని గృహమున కొకప్పుడు 'పర్వతుఁడు' నారదుఁడు' అను మహర్షు లతిథులుగా రాఁగా, హరిశ్చంద్రుఁడామునులను గౌరవించి, నారదునిఁ బుత్రోత్పత్తి వలనఁ గల్గు లాభముల నడుగ, నారదుఁడు పుత్రోత్పత్తి వలనఁ గల్గు లాభములను జెప్ప' హరిశ్చంద్రుఁడు తనకెట్లు పుత్రోత్పత్తి కల్గునో చెప్పు మనెను. అందులకు నారదుఁడు, ఓరాజా ! నీవు 'వరుణ దేవుని నాకుఁ బుత్రు నొసఁగిన నే నాపుత్రుని బశువుగాఁ జేసి నిన్నుఁగూర్చి యజ్ఞముఁ జేయుదు నని ప్రార్థింపుము. నీకు వరుణుఁడు పుత్రు నొసంగు ననియెను.

పిమ్మట హరిశ్చంద్రుఁడు వరుణుఁగూర్చి నాకొక పుత్రు నొసంగిన నే నాపుత్రుని బశువుగాఁ జేసి, యజ్ఞముఁ జేయుదు నని ప్రార్థింప వరుణుఁడు ప్రత్యక్షమై పుత్రప్రాప్తి కలుగ వరమిచ్చెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిమ్మట హరిశ్చంద్రునకు 'రోహితుఁడు' అను పుత్రుఁడుద్భవింప వరుణుఁడు వచ్చి, ఈబాలునిచే నాకు యజ్ఞముఁ జేయు మన హరిశ్చంద్రుఁడు:—

(1) "జాతాశౌచదినములు వెళ్లినగాని బాలపశువునకు యజ్ఞార్హత లేదు." అనఁగా వరుణుఁడు వల్లె యని వెడలిపోయెను.

జాతాశౌచదినములు వెళ్లినపిమ్మట వరుణుఁ డేతెంచి నీవు చెప్పిన గడువు ముగిసినదిగాన వీనిచే నాకై యజ్ఞము నొనర్పు మనఁగా హరిశ్చంద్రుఁడు:—

(2) 'పశువునకు దంతములు వచ్చినఁగాని మేధ్యమగుట కర్హత లేదు.' అనఁగా వరుణుఁ డంగీకరించి వెళ్లిపోయెను.

పిమ్మట రోహితునకు దంతములు రాఁగా వరుణుఁడు వచ్చి, బాలునకు దంతములు వచ్చినవిగాన వీనిని యాగమ పశువుం జేసి యజనము నొనర్పు మనెను.

(3) ఈబాలున కిపుడు వచ్చిన దంతములు స్థిరములై

---

(1) "యదావై పశుర్నిర్దశోభవ త్యథ సమేధ్యో భవతి నిర్దశోఽన్వస్తథ త్వా యజా ఇతి."

(2) "యదావై పశోర్దంతా జాయంతేఽథ సమేధ్యో భవతి దంతాన్వస్య జాయంతా మథత్వా యజా ఇతి."

(3) "యదావై పశోర్దంతాః పద్యంతేఽథ సమేధ్యో భవతి దంతాన్వస్య పద్యంతా మథత్వా యజా ఇతి".



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవి కావుగాన నివి యాడినఁగాని యాగార్హంబై యీబాలుఁ డుండఁడు. అని హరిశ్చంద్రుఁ డన 'తథాస్తు' అని వరుణుఁడు వెడలిపోయెను.

తరువాత పాలపండ్లూడఁగా వరుణుఁ డెప్పటియట్ల వచ్చి పల్లూడినవిగాన, వీనిచే జన్నము నొనర్పు మనఁగా:—

(4) 'రెండవసారి దంతములు రానిదే పశువు సర్వావయవ సంపూర్ణత నొందదు.'

అని హరిశ్చంద్రుఁ డన వరుణుఁ డంగీకరించెను.

రెండవసారి దంతములు రాఁగా, వరుణుఁ డెప్పటియట్ల వచ్చి అవయవసంపూర్ణత కలిగెనుగాన వీనితో యజ్ఞముఁ జేయు మనెను.

(5) 'పశువుకాఁగల క్షత్రియుఁడు స్వకులోచితముగ సన్నాహశీలి (యుద్ధమున కర్హతగల కవచ ధనుర్బాణాది ధారి) కాకుండిన, యజ్ఞమునందు విశసింప నర్హుఁడు కాఁడు.'

అని హరిశ్చంద్రుఁ డనఁ బూర్వమువలెనె వరుణుఁ డంగీకరించి వెడలిపోయెను.

పిమ్మట 'రోహితుఁడు' సన్నాహశీలి కాఁగా వరుణుఁ

(4) "యదావై పశోర్దంతాః పునర్జాయంతేఽథ సమేధ్యో భవతి. దంతాన్వస్య పునర్జాయంతా మథత్వా యజా ఇతి."

(5) "యదావై క్షత్రియః సాన్నాహుకోభవ త్యథ స మేధ్యో భవతి. సన్నాహన్ను ప్రాప్నో త్యథ త్వా యజా ఇతి"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డే తెంచి, సన్నాహశీలి యగు నీకుమారునిచే యజనం బొనర్పు మనెను.

(6) "దానికి హరిశ్చంద్రుఁ డట్లే చేయుదునని యంగీకరించి కుమారుఁ డగు రోహితుని బిలిచి యిట్లు చెప్పెను.

నాయనా! నాకొఱకు నిన్నీవరుణుఁ డిచ్చెను. అయ్యో! నీచే నే నీ వరుణుని గూర్చి యజ్ఞముం జేయుచున్నా నన, నా రోహితుఁ డంగీకరింపక ధనుర్ధరుఁడై యరణ్యమునకుఁ బోయి యట నుండెను.

హరిశ్చంద్రుఁ డనినరీతిని యజ్ఞమును జేయనందున వరుణుఁడు హరిశ్చంద్రుని బట్టుకొనఁగా, హరిశ్చంద్రునకు 'జలోదర' రోగము కలిగి, బాధపడుచుండెను.

## రోహితుని ప్రవర్తనము

తండ్రికి జలోదరరోగము కలిగెనని యరణ్యమందు సంవత్సర మున్నతరువాత 'రోహితునకు' దెలిసి యాతఁడు తిరిగి పురమునకు వచ్చుచుండఁగా 'ఇంద్రుఁడు' బ్రాహ్మణవేషధారియై మార్గమధ్యమున నొక సాకు చెప్పి రోహితుని మరల వనమునఁ దిరుగునట్లు చేసెను. ఇట్లొకపర్యాయము కాదు; అయిదు పర్యాయము లింద్రుఁ డట్లు రోహితుని వెనుక కరణ్యము

(6) "సతథేత్యు క్త్వా పుత్రమా మంత్రయా మాస. తతా! యంవై మహ్యం త్వా మదదా ద్ధంత! త్వయాహ మిమం యజా ఇతి. సహ నేత్యు క్త్వా ధనురాదా యా రణ్య ముపాతస్థౌ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకుఁ బంపుటచే రోహితుఁ డరణ్యమున నాఱేండ్లు తిరిగెను
(ఇంద్రుఁడు రోహితునకుఁ జెప్పిన సాకు లిట నప్రస్తుతమని వి
రింపలేదు.)

ఎట్లయినను హరిశ్చంద్రుఁడు మనుష్యపశువుచే యజ్ఞ
ముఁ జేయనియెడల నాతనికి రోగనివృత్తి కాదని, రోహితుఁ
తలఁచి తనకు మారుగా నొకనిని హరిశ్చంద్రు యాగము
యరణ్యమున వెదుకఁ బ్రారంభింప, నాయడవియం దొక
తపు చరియలో దరిద్రముచే భుక్తికి లేక బాధ నొందుచు
'సూయవసుని' పుత్రుఁడగు 'అజీగర్తుఁడు' అను నొక బ్రాహ్మ
ణుని జూచెను. అయ్యజీగర్తునకు (1) 'శునఃపుచ్ఛుఁడు (2)
శునశ్శేపుఁడు (3) శునఃలాంగూలుఁడు' అను ముప్పురు కుమా
రులు కలరు. అట్టి యాబీదబాపని జూచి, రోహితుఁ
"ఓఋషీ! నీకుమారులలో నొకనిని నాకిమ్ము. నీకు నూఱు
వులనిచ్చెదను. నాకుఁ బ్రతినిధిగా వానిని జేసికొని యజ్ఞ
చేయింతు" ననెను.

దానికి నజీగర్తుఁ డంగీకరించెను. కాని,

గీ. పెద్దవాఁడు నాకెంతయుఁ ♦ బ్రియతనూజుఁ
డతని నే నీకు నీఁజాల ♦ ననియెఁ దండ్రి;
పిన్నవాఁడు నాకెంతయుఁ ♦ బ్రియుఁడుగాన
యాకుమారుని నీఁజాల ♦ ననియెఁ దల్లి ॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

-ఃఃఃః శునశ్శేపుని గాథలు ఃఃః-

తలిదండ్రుల మాటలను విని మధ్యముఁ డగు శునశ్శే పుఁడిట్లనియెను.

గీ. పెద్దవాఁడు తండ్రికిఁ జాలఁ • బ్రియసుతుండు
పిన్నవాఁడు తల్లికి ముద్దు • ప్రియసుతుండు
వాగలిరువురు నొల్లని • వాఁడ నైన
మధ్యముఁడ నేను వచ్చెద • మానవేంద్ర!

నీవిచ్చెదననిన గోవులను వీరికిమ్ము. నీవెనుక నేవచ్చెద ననిన నతఁడు నూఱుగోవులను 'అజీగర్తున'కిచ్చి, శునశ్శేపుని వెంట నిడుకొని, పురప్రవేశంబు చేసి, తండ్రియగు హరిశ్చంద్రు నితో, తండ్రీ! నాకు మారుగ వీనిని యజ్ఞపశువుగాఁ దెచ్చితి ననెను.

(1) అందులకు హరిశ్చంద్రుఁడు సంతసించి, వరుణునితో నీ'శునశ్శేపుని'ఁ బశువుగాఁ జేసి నీకుయజ్ఞము నొనర్తునన, వరుణుఁడు, క్షత్రియునికంటె బ్రాహ్మణుఁడె శ్రేష్ఠుఁడుగదా! వీనిం బశువుగాఁ జేసి 'రాజసూయ' యాగముంజేయు మని చెప్పగా, హరిశ్చంద్రుఁడు 'అభిషేచన' సంబంధమగుదానియందు (సోమ

(1) "సవరుణం రాజాన ముపససా దానేన త్వా యజా ఇతి. తథేతి. భూయాన్వై బ్రాహ్మణః క్షత్రియాదితి. వరుణఉ వాచ॥- తస్మా ఏతం రాజసూయం యజ్ఞక్రతుం ప్రోవాచ. తమేత మభిషేచనీయే పురుషం పశుమాలేభే॥—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాగాంగమగు 'ఉదవసానీయేష్టియందు) శునశ్శేపుని

గాఁ బొందెను.

(2) ఆయజ్ఞమున హరిశ్చంద్రునకు 'విశ్వామిత్రు

హోత, జమదగ్ని అధ్వర్యుఁడు' వసిష్ఠుఁడు బ్రహ్మ,

స్యుఁడు 'ఉద్గాత' అను ఋత్విక్కులైరి."

పురాణవాఙ్మయమునందు హరిశ్చంద్రుఁడు సత్య

కుఁ బుట్టినిల్లు, వసిష్ఠవిశ్వామిత్రులు- అందువిశ్వామిత్రు

నీచాతినీచమైన కలహములకు_ వసిష్ఠునిగాని, తత్సంబంధు

గాని, అసహ్యించుకొని వారిని బలుబాధల నొందించుటకు

ట్టిన మూలకందము.

వైదికవాఙ్మయమునందో_ హరిశ్చంద్రుఁ డొ

కాదు, అయిదుసారులు వరుణదేవునంతటివానితో సాక్ష

ల్పించి యాడితప్పిన మృషావాది.

వేదమునకు- అందు ప్రధానమైన ఋగ్వేదమునకు-

డువంతులు దాను,తనపుత్ర, శిష్య ప్రశిష్యులు, ద్రష్టృత్వము

ట్టియు బ్రాహ్మ్యమొసఁగు గాయత్రికిఁగర్త యునగు విశ్వామి

డును బ్రహ్మర్షిశ్రేష్ఠుఁడై యన్ని వేదములలోను జాలభాగ

కు ద్రష్టత్వ మొందిన వసిష్ఠ, మహర్షియు, పురాణవాఙ్మయ

నందు కల్లుదాగినవారివలె, కాటుకుక్కలవలె కలహించ

(2) తస్యహ విశ్వామిత్రో హోతాసీ జ్జమదగ్ని రధ్వర్యు

ర్వసిష్ఠో బ్రహమాఽ యాస్య ఉద్గాతా॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రి. వైదికవాఙ్మయమునందు, బ్రహ్మర్షులుగానె పరిఢవిల్లుట ము, అందును 'వసిష్ఠ, విశ్వామిత్రులకు, ముఖ్యవిరోధకారణముగాఁ దలంపఁ బడు హరిశ్చంద్రుని విషయముననే—ఆతనియజ్ఞమునందే—ప్రధాన ఋత్విక్కులగుటయు నాశ్చర్యకరము కాదా ?

దాని నటుండనిచ్చి శునశ్శేపుని గుఱించి చూతము. షి నల్వురు మహర్షులు రాజసూయముఁ జేయింపుచుండఁ గా మనుష్యపశువును బంధింప ననువగు కర్మమే తెంచినది. శునశ్శేపుని బశువుగా బంధింపుసమయ మాసన్నమైనది. విశసింపఁ బడు పశువును 'ఉపాకృతము' అను సంస్కరణముఁ జేసినవెంటనే (1) రెండుపేటలు వేఁయబడి రెండుబారలు పొడవుగల, రెండు శనిర్మితములగు త్రాళ్లతో, కాళ్లను తలను గట్టిగాబంధించి, మూఁడుపేటలు గలిగి మూఁడుబారలుపొడువుగల త్రాటిచే మధ్యభాగమును యూపస్తంభమున కంటఁ గట్టవలయును.

ఇపుడు విశసింపఁ బడు పశువో, సాధారణపశువా ? కాదు, యువకుఁడు—మహర్షిగోత్రోత్పన్నుఁడు—మహాకవి—వేదవేత్త—బ్రహ్మవర్చస్వి—మహాభక్తుఁడు—అట్టివానిని, బైధమున బంధింప నెవనికి చేతులు వచ్చును? ఎవఁడును బంధింప నంగీకరింప లేదుగాని, నూఱుగోవులకుఁ బుత్రు నమ్మిన శునశ్శేపుని తండ్రియగు 'అజీగర్తుఁడే' నాకింకొక నూఱుగోవుల

(1) కాత్యాయనశ్రౌతసూత్రమున నీయంశములు గలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిచ్చినయెడల నేను శునశ్శేపుని బంధింతునని పలుక, హరిశ్చంద్రుఁ డట్లే నూఱుగోవుల నీయ 'అజీగర్తుఁడు' దారుహృదయము—కాదు. శిలాహృదయముతో, పుత్రుని విశసింపఁ యూపస్తంభమునకుఁ బైరీతి నంటఁ గట్టెను.

(1) అపు డధ్వర్యుఁ డేతెంచి, బంధితుఁ డగు శునశ్శేపునకు "ఉపాకృత, నియుక్త, అప్రీణన, పర్యగ్నికరణములు" అను కర్మములఁ జేసెను.

(పై కర్మములు వధ్యపశువునకుఁ బ్రతియజ్ఞమునను జేతురు. అవి పశువు నుద్దేశించి చెప్పు కొన్ని మంత్రములతో గూడిన క్రియలై యుండును. (పర్యగ్నికణము అను కర్మమున దర్భలకు నిప్పు నంటించి మంట యారినపిమ్మటఁ బశువునకు చుట్టును ద్రిప్పుదురు.)

పిమ్మటఁ బశువును ఖడ్గముతో విశసించుసమయ మేతెంచెను. బ్రహ్మతేజస్వియగు శునశ్శేపుని బంధించుటకే సిద్ధపడని యతఁ డపుడు ఖడ్గముతో ఖండింప నెవఁ డాయత్తపడును? అపుడు క్రూరుఁడగు 'అజీగర్తుఁడే' తనకుమారుని మఱినూఱు గోవుల నిచ్చిన యెడల నేను ఖండింతు నని వజ్రహృదయముఁతో పల్కెను. నూఱుగోవులను హరిశ్చంద్రుఁడీయ నజీగర్తుఁడు కుమారుని విశసింప ఖడ్గము వహించెను,

హా! ఎంతక్రూరకర్మము! "బాలున్, హాఁసదబి...

---

(1) చూ॥ ఐతరేయబ్రాహ్మణము. 7, 3, 4.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శీలున్, సుగుణాలవాలు, శ్రీమన్మేధావాలున్" అజీగర్తుఁడు
ఖండింపఁ దలంచెను. క్రూరత్వమునందు, అజీగర్తుఁ డధికుఁడా?
మతభేదముచేఁ గుమారుని ఖండింప నెంచిన హిరణ్యకశిపుఁ
డధికుఁడా? బైబిలునందుఁ జెప్పఁబడిన గురుద్రోహి యగు
(ఏసుక్రీస్తును రోమనుల కప్పగించిన) పేతు రధికుఁడా? లాభ్య
ముచేఁ గన్నకొడుకును మూఁడువందల గోవులకు విక్రయించి,
తానె కట్టుకట్టి, తానె విశసింప ఖడ్గమునెత్తిన అజీగర్తుఁ డందఱి
కంటెను మహాక్రూరుఁడు కాఁడో?

శునశ్శేపుఁడు, తొలుతఁ దన్ను బంధించి, పర్యగ్నికర
ణానంతరము (1) "ఇతరయాగములలో పర్యగ్నికృతమగు మ
నుష్యుల నరణ్యమున విడువఁగలరు" అని కలదు గాన అట్లే దా
నెచటనైన విడువఁబడిన నెటులనో జీవింపవచ్చునని తలఁచెను.
కాని, రాజసూయమునఁ దప్పక విశసింపఁ బడవలయు నను నంశ
మాతనికిఁ దెలియదు. అందువలనఁ దండ్రి ఖడ్గముఁ జేఁబూనఁ
గానె యిట్లనుకొనెను.

(2) పిమ్మట శునశ్శేపుఁడు చూచి, హా! నన్ను మను
ష్యేతర పశువువలెనె వధింతురా? నే నిపుడు దేవునే శరణు
వేఁడెదను.

---

(1) "పర్యగ్నికృతం పురుషమారణ్యాం శ్చోత్సృజంత్యహింసయా"
(2) "అథహా శునశ్శేప ఈక్షాంచక్రే౽మానుషమివ వై మా విశసి
ష్యంతి హంతాహం దేవతా ఉపధావానీతి,"


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వధింపఁబడుటకు సిద్ధముగానుండి, కట్లచే బంధిం
చుఁ బ్రాణముపై నాస వదలక, పరమేశ్వరుని, పరమేశ్వ
యొక్క వివిధగుణరూపులగు 'ఇంద్రాగ్ని వరుణాది' దేవ
బలువిధములఁ బ్రార్థించెను. అతఁ డపుడు ప్రార్థించిన ప్ర
రూపకమగు మంత్రములలో గొన్ని, ఆసేతు హిమాచ
నడుమనుండు విప్రోత్తము లిప్పటికిని, సాయంసంధ్యావ
మునఁ బఠింపుచుండుటయే విశేషాంశము. ప్రస్తుతాం
కవి యంతగా నవసరము లేకుండినను హృద్యములు,
ములు నగుటచేఁ గొన్ని మంత్రార్థములనిట వ్రా
చున్నాను.

(1) ఏవేల్పుఁ జింతును? శుభకరుఁ డగు నేదేవుని
ర్థింతును? తిరిగి నన్నే దేవత భూమిపై నుండనిచ్చును?
గనేను మాతాపితరులతోఁ గూడుకొని యుండుస్థితి కలు

(2) ఓ వరుణా! నామొఱ్ఱ నాలకింపుము. రక్షణే
నీ కెదురుగఁ జేయు నాస్తోత్రముల నాలకించి నన్ను సుఖ
నిగాఁ జేయుము.

---

(1) ఋ॥ కస్యనూనం కతమస్యామృతానాం మనామహే
దేవస్యనామ। కోనో మహ్యా అదితయే పునర్దా త్పితరం
శేయం మాతరంచ॥ ఋ. 1—24—

(2) ఇమంమే వరుణ శ్రుధీహవ మద్యాచ మృడయ।
త్వా మవస్యురాచకే॥ ఋ. 1—25—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(3) బహుజనులచే స్తుతింపఁబడు నో వరుణదేవా! స్వధీనమునందే మరణము గల నేను వేదవాక్కుచే నిన్ను నుతించుచు నాయువు నిమ్మని కోరుచున్నాను. యజమానుఁడుగూడ హవిస్సులచే నిన్నాయువునే కోరుచున్నాఁడు, నీవు మాయిరువురకోర్కెల ననాదరముతో హేళనము చేయక తెలిసికొని మాయిరువురయొక్క యాయుర్దాయము వృద్ధిఁజేయుము.

ఇట్లు పెక్కువిధముల వరుణాది దేవతలను స్తోత్రము చేసి, యింకను నిట్లనుచున్నాఁడు.

(4) గొప్పవారలకు నమస్కారము, పిల్లలకు వందనము, యువకుల కభివాదనము, వృద్ధులకు జోహారు. ఓ దేవతలారా! నాకు శక్తి గలిగినయెడల (జీవించినయెడల) మిమ్ములనర్చింతును? పరమేశ్వరుని స్తోత్రముచేయుటలో లోపమును గలిగింపను.

కట్టకడకు 'ఉషస్సు' ను స్తోత్రము చేయుచుండఁగా, కాలుమని ఆపాదమస్తకముఁ గట్టిన కట్లు తెగిపోగా శునశ్శే

(3) తత్వాయామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే
యజమానో హవిర్భిః। అహేళమానో వరుణేహ
బో ధ్యురుశంస మాన ఆయుః ప్రమోషీః॥ ఋ. 1-26.

(4) నమో మహద్భ్యో నమో అర్భకే భ్యో నమోయువభ్యో నమ ఆశి నేభ్యః। యజామదేవా న్యది శక్నవామ మాజ్యాయసః శంస మావృక్షి దేవా ః॥ ఋ-1—27—13.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుఁడు ప్రాణభీతిచే నెదుటనుండిన విశ్వామిత్రుని యొక్క
బడి రక్షింపుమని వేడుకొనెను.

(1) శునశ్శేపుఁడు విశ్వామిత్రు నంకతలముఁ జేరగ
శునశ్శేపుని తండ్రియగు అజీగర్తుఁడు విశ్వామిత్రుకడ కే
నాపుత్రుని నాకి మ్మన,విశ్వామిత్రుఁడు నేనీయను వీనిని దే
తలే నాకిచ్చిరనెను. అప్పటినుండియే శునశ్శేపునకు దేవరా
డను పేరుకలిగెను.

పిదప 'అజీగర్త, శునశ్శేపులకును;' 'శునశ్శేప, విశ్వా
త్రులకు' నైన సంవాదములును, శునశ్శేపుని విశ్వామిత్రు
పుత్రునిగా సంగీకరించుటయు, విశ్వామిత్రపుత్రు లంగీక
నందున, విశ్వామిత్రుఁ డట్లంగీకరింపని పుత్రులను భ్రష్టుల
డని శపింప, శప్తులగు వారలలోని వారె మనయాంధ్రుల
రగుటయు మొదలగు నంశము లిట నవసరములే దని వివ
లేదు. కాని, విశసితపశువుచేఁ జేయఁదగు కర్మకలాపము పూ
కాకుండుటచే హరిశ్చంద్రుని రాజసూయయాగము పూర్తి కా
దను సందియ ముద్భవించుచున్నది.

---

(1) "అథహ శునశ్శేపో విశ్వామిత్రస్యాంకమాస సాద. సహో
చాజీగర్తః సౌయవసిర్ఋషే! పునర్మే పుత్రం దేహీతి. 
హోవాచ విశ్వామిత్రో దేవావా ఇమం మహ్యమదాసతే
సహ దేవరాతో వైశ్వామిత్ర ఆస॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొన్ని యెడలఁ గొన్ని పశువులకు యూపస్తంభమునకు బంధించినపిమ్మట 'పర్యగ్నికరణము' అను కర్మముఁ జేసి విడుచుటయే విధియై యున్నది. ఆయంశములు ముందు వ్రాయఁబడును. రాజసూయయాగవిషయమున నట్టిపరిస్థితి (పర్యగ్నికరణానంతరము విడువవలయు నని) యెచటను లేదు. విశసింపఁబడవలయు ననియే యింతకుఁ బూర్వము వ్రాయఁబడిన యంశములచే స్పష్టపడుచున్నదిగాని, విశ్వామిత్రాదు లెట్లో యాగపూర్తిని జేసి, 'అంజస్సవము' అను నొకకర్మముఁ జేయించి, శునశ్శేప హరిశ్చంద్రు లన్యోన్యము స్పృశించునటులఁ జేయుటచే యాగము పూర్తియగుటయు, హరిశ్చంద్రునకు రోగవిముక్తి యగుటయు, కలిగె నని 'ఐతరేయబ్రాహ్మణము'న జెప్పఁబడి యున్నది. ఆయంశములు గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

(1) "అజీగర్తపుత్రుఁ డగు శునశ్శేపుని వరుణుఁడు పట్టుకొనఁగా, శునశ్శేపుఁడు వరుణదేవతాకఋక్కును జూచి (ద్రష్టయై) తాను గ్రహింపఁబడిన వరుణపాశమునుండి విడుదల నొందెను."

అని కొంతభేదముతో, 'తైత్తరీయ' సంహితలో స్వల్పముగాఁ జెప్పఁబడి యుండుటమాత్ర ముదాహరింపఁ దగియున్నది.

---

(1) "శునశ్శేప మాజీగర్తిం వరుణో గృహ్ణాత్స ఏతాం వారుణీ మపశ్యత్తయాత్మానం వరుణపాశాద ముంచత్॥

తైత్తిరీయ సంహిత. 5—2—1.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హరిశ్చంద్ర శునశ్శేపులఁగూర్చిన గాథలు పునరభిషే కాలమునందు (1) బంగరుజరీతో నేసినబట్టపై 'హోత్ర' కూర్చుండి చెప్పుచుండఁగా నట్టిబట్టమీఁదనే కూర్చుండిన యధ్వర్యుఁ డూఁకొట్టుచుండఁగా రాజసూయయాగకర్త వినవలయు ననియు, అట్లాగాథలు చెప్పినందులకు హోతకు వేయియు, అధ్వర్యునకు నూఱును, గోవులను దక్షిణగా నిచ్చుటయేగాక పై బంగరుజరీబట్టలను, రెండు వేసడములతోఁ బూన్పఁబడి రజతాలంకారములుగల రెండురథములఁగూడ పై యిరువురకు దక్షిణగా నీయవలయు ననియుఁ గొన్నివిధులు ఐతరేయబ్రాహ్మణమునఁ గలవు. ఆయంశము లిట నంతగాఁ బ్రసక్తి లేనందున వ్రాయలేదు.

## పు రు ష మే ధ ము.

ఇట పురుషుని విశసించి యజ్ఞము చేయుదురా ? అను నంశముఁగూర్చి కొంచెము చర్చింపవలసియున్నది.

ప్రాచీనకాలమునందు 'పురుషమేధమె' మహోత్కృష్ట యాగమై యుండె నని వేదమువలనఁ దెలియవచ్చుటయేకాక,

(1) బంగరుసూత్రములతోఁ గూడిన వస్త్రమునకు 'హిరణ్యకశిపుర్థము' బ్రాహ్మణమున వాడఁబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అశ్వమేధయాగము పొందింపలేని మహాఫలమునుగూడ నరమేధము పొందించునని వేదము చెప్పియున్నది. (1)

మఱియు 'విధ్యర్థవాదములు' కూడ నరమేధమును బ్రోత్సాహపఱచుచున్నవి. అందుఁ గొన్ని యీక్రింద వ్రాయఁబడుచున్నవి.

(2) 'దేవతలు పురుషుని బంధించి యజ్ఞముం జేసిరి.'

(3) 'ప్రజాపతి తనయొక్క వపను దీసి యూహుతి నొనర్చెను.'

(4) 'బ్రహ్మకొఱకు బ్రాహ్మణుని విశసించుచున్నాఁడు.'

(ఇట్లిట నూటయెనుబదియార్వురను విశసించి నరమేధము నొనర్పవలయు ననునంశము చెప్పఁబడెను.)

(5) 'దేవతలు పురుషునే పశువుగాఁ జేసి విశసించిరి.'

(6) 'బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుని ఆలంభించుచున్నాఁడు.'

---

(1) చూ. శుక్లయజుస్సంహిత.

(2) "దేవా యజ్ఞ మతన్వత. అబధ్నన్ పురుషం పశుం" ఋగ్వేదము.

(3) "ప్రజాపతి రాత్మనో వపా ముత్ఖిదత్" తైత్తిరీయసంహిత.

(4) బ్రహ్మణే బ్రాహ్మణ మాలభతే" ఇత్యాది. తైత్తరీయబ్రాహ్మణము.

(5) "పురుషంవై దేవాః పశుమాలభంత" ఐతరేయబ్రాహ్మణ.

(6) "బ్రాహ్మణో బ్రాహ్మణమాలభతే" శ్రుతిః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్టి విధ్యర్థవాదవాక్యము లనేకములు గలవు. కా క్రిమముగా నరమేధము తగ్గిపోయినది.

కలియుగమున మనకుఁ దెలిసినంతవఱకు క్రైస్తవశక ఆ రేవు శతాబ్దములనడుమ నుండిన (580_611) విష్ణుకుండి వంశస్థుఁడగు మాధవవర్మ పదునొకం డశ్వమేధయాగము జేసి యంతటితోఁ దృప్తినందక నరమేధయాగముఁ గూడఁ జే నఁట!

(ఈయంశము మాధవవర్మవంశజుల శాసనములవల దెలియనగుచున్నది.)

అట్టి దారుణకార్యము చేయుటచే నచిరకాలములో విష్ణుకుండినరాజ్య మంతరించి తూర్పుచాళుక్యరాజ్యము స్థా పఁబడుటకు హేతువయ్యె నేమొ? దాని నటుండనిచ్చి ప్ర తాంశముఁ జూతము.

పై యంశములఁ జూడ 'రాజసూయ' యాగమునఁ బు షపశువును విశసించుట సాధారణ మనియే స్పష్టమగుచున్న "నరమేధయాగమున నూటయెనుబది మూర్వురు పురుషు 'యూపస్తంభము'లకు బంధించినను [1] పర్యగ్నికృతుఁడగు పు షు నరణ్యమున హింసింపకుండఁగ విడిచెదరు." అను శ్రు క్యముచే నొక్కనిమాత్రమె విశసించి తక్కినవారి నంద

(1) "పర్యగ్నికృతం పురుష మారణ్యాం క్షోత్స్రజం త్యహింసయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నరణ్యమున విడిచెద రనియే తెలియనగుచున్నది. మనుష్యులనే కాదు, అశ్వమేధయాగమునకుఁ దేఁబడిన వివిధములగు మూఁడువందలు మితిగల 'వనచర, ఖచర, జలచరా'దులలో వనచరములగు 'సింహ వ్యాఘ్రాదులను'గూడ (1) "పర్యగ్నికృతములగు నారణ్యకజంతువులను హింసింపక వనములోనె విడిచిపెట్టెదరు." అనువేదవాక్యముచేఁ గొన్నిటిని బర్యగ్నికరణా నంతరమునవిడిచిపుచ్చుటకలదు. కాని,రాజసూయ పశువగువానినిమాత్రము విశసించుటయే విధియైనట్లు శునశ్శేపుని పరిదేవన వాక్యమగు(2) "అయ్యో! మనుష్యేతరమగు పశువునువలెనె నన్ను విశసింపఁగలరు." అనుదానిచే స్పష్టము కాఁగలదు.

పర్యగ్నికరణానంతరము (అగ్నినిజుట్టుముద్రిప్పినపిమ్మట) యూపస్తంభమునకుఁ గట్టఁబడిన జంతువు నరణ్యమున విడువఁబడు శ్రౌత సాంప్రదాయమె, రానురాను, 'పిశాచ, బాలగ్రహాదులు' సోఁకినవారికి జంతువులను, మనుష్యాకారములగు పిష్టాదివిగ్రహములను, దీపాదులచే దిగఁదుడిచి, గ్రామసీమాంతమున విడుచు నాచారముగా మాఱినట్లు తోఁచుచున్నది.

'శాక్తేయాది'మతములలో నింకను రహస్యకృత నరపశు విశసనము నామమాత్రముగనున్న దనియే చెప్పవలసియున్నది.

---

(1) "పర్యగ్నికృతా నారణ్యా నుత్సృజంత్యహింసాయై" తై-బ్రా.
(2) "అమానుషమిత మా విశసిష్యంతి; హంత" ఐ. బ్రా.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రసక్తానుప్రసక్తమగు శునశ్శేపుని గాథచే, రాజసూయాంగమైన సోమయాగము ముగింపఁబడినపుడు చేయఁబడినట్టిదియు 'నరపశువిశసనముతోఁ గూడినట్టిదియు నగు 'ఉదవసానీయము' అనునిష్టి జరుగునని తెలియఁగలదు. అది ముగియగనె 'పునరభిషేచనము' అనుకర్మము జరుగును. 'ఉదవసానీయేష్టి' ముగియగనే రాజునకు బ్రాహ్మ్యముపోయి రాజత్వప్రాప్తి కల్గును. పునరభిషేచనకర్మము రాజతీవితోఁ గూడుకొనిన యుత్కృష్ట కార్యము, అది యెట్టిదో చూతము.

## పు న ర భి షే చ న ము

'ఉదవసానీయేష్టి' ముగియునప్పటి కీక్రిందివస్తువుల నధ్వర్యుఁడు సిద్ధపఱచి యుంచవలెను.

" [1]మేడికఱ్ఱతో లోడి తేఁడు, ఎత్తుగల నాలుగుకోళ్లును, అడుగుయెత్తుగల పైభాగములు గలిగి, నలుచదరమై, ముంజిగడ్డి (ఒకవిధమగుపేము) తో నల్లఁబడిన సింహాసనమును (ఆసందిని) (1) వ్యాఘ్రచర్మమును (2) మేడికఱ్ఱతోఁజేయఁబడిన పాత్రములలో [2] పెరుఁగు, తేనె, నేయి, ఎండలో కురిసిన

(1) శుక్లయజుస్సంహితలో 'చంద్రకఱ్ఱతో నాసందిని జేయవలయు నని కలదు.

(2) శుక్లయజుస్సంహితలో 'మోదుగ, మేడి, మఱ్ఱి, రావి, కఱ్ఱలతో జేయఁబడిన పాత్రములలో వివిధనదులనుండియుఁ గొనిరాఁబడిన జల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాననీరు, లేఁబచ్చిక, లేఁత మొక్కలు, సుర, దూర్వములు, అనువస్తువుల నుంచి 'స్ఫ్యము' అనుకఱ్ఱతోఁ జేయఁబడిన పనిముట్టుతోఁ గొన్ని రేఖలు గీసి, ఆగీతలపైని ఆసింహాసనముయొక్క వెనుక కాళ్లు రెండును. 'అంతర్వేది' యందును, ముందు కాళ్లు రెండును బహిర్వేదియందును నిలుచున ట్లమర్చి (అంతర్వేది, బహిర్వేదులనునవి యజ్ఞశాలలోఁ గొన్నినిధుల కేర్పడిన నలుచదరములై యలంకృతములగు స్థలములకుఁ బేరు.) ఆసింహాసనముపై వ్యాఘ్రచర్మముఁ బఱువవలెను. ఆచర్మముపై బంగరుకూడ నుండవలెనని 'కాత్యాయనుఁడు' చెప్పుచున్నాఁడు.

పిమ్మట మహారాజు కొన్ని హోమాదిక్రియల నొనర్ప ఋత్విక్కులు కూడఁ గొన్నిక్రియలను నడిపినపిమ్మట రాజు సింహాసనముపై నెక్కుచు నీక్రింది మంత్రార్థముఁ జెప్పును. (1)"నేను దేశపాలనముకొఱకు, ధర్మపాలనముకొఱకు, దేశమున భోజ్యపదార్థాభివృద్ధికొఱకు, ఇతరులకు నారాజ్యము లోఁబడకుండుట కొఱకు, ఇతరరాజులకంటె నధికుఁడనుగా నుండుటకొఱకు, పరమేశ్వరలోక ప్రాప్తికొఱకు, పరలోకమునందును నిత

---

ముల నుంపవలయుననియు మోదుగకఱ్ఱతోఁ జేయఁబడిన పాత్రమునందు 'సరస్వతీనది' జలమును ప్రత్యేక ముంపవలయు ననియుఁగలదు.

(1) రాజ్యాయ సామ్రాజ్యాయ భౌజ్యాయ స్వారాజ్యాయ వైరాజ్యాయ పారమేష్ఠ్యాయ రాజ్యాయ మహారాజ్యాయాధిపత్యాయ స్వావశ్యాయ ఆతిష్ఠా యారోహామి"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రులకంటె నధికుఁడనుగా నుండుటకొఱకు, నన్ను నేనె వశము చేసికొనుటకొఱకు (ఇంద్రియజయముకొఱకు) సింహాసనము నెక్కుచున్నాను.''

ఇట్లని ప్రజల హర్షధ్వనులు చెలరేఁగ రాజు సింహాసనము నధిష్ఠించి యెడమకాలి తొడపైఁ గుడికాలి పిక్కను జేర్చి కూర్చుండును.

రాజు సింహాసనము నధిష్ఠించి కొన్ని దేవతాప్రార్థనామంత్రములను బఠించినపిమ్మట, పునరభిషేకముఁ జేయు ఋత్విక్కు 'ఆతపవర్షోదకము' గల మేడికఱ్ఱగిన్నెను జేతఁబూని, కొన్ని యుదకశాంతిమంత్రములఁ జెప్పి, కొన్నిటిని మహారాజుచేఁ జెప్పించి, మేడిరెమ్మను రాజుశిరస్సున కడ్డుగ నుంచి క్రిందిమంత్రముఁ జెప్పుచు నభిషేకించును. (1)

(2) '' ఓరాజా! ప్రజాపతి యేయుదకములచే 'ఇంద్రుని, సోముని, వరుణుని, మనువును' అభిషేకించెనో, ఆయుదక

---

(1) శుక్లయజుస్సంహితలో 'ఆతపవర్షోదకము' నకు మారు 'సరస్వతీ జలము' చెప్పఁబడెనని కలదు. అధ్వర్యుపురోహితులు పలాశపాత్రములోని సరస్వతీజలముతోను, ఉదుంబరపాత్రములోని జలముతో నధ్వర్యువ్యతిరిక్తులగు నితర ఋత్విక్కులును, న్యగ్రోధపాత్రోదకముతో రాజబంధువును, అశ్వత్థపాత్రోదకముతో మఱియొక క్షత్రియుఁడును ఒకవైశ్యుఁడును రాజునభిషేకింతురని కలదు.

(2) యాభిరింద్ర మభిషించ త్ప్రజాపతిః సోమం రాజానంవరుణం మనుం తాభిరద్భి రభిషించామి త్వామహం రాజ్ఞాం త్వమధిరాజో భవేహ''

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములచే నిన్నభిషేకించుచున్నాను గాన నీవు రాజులలో నధిరాజవు కమ్ము"

పిమ్మట 'దధి, మధు, ఘృతాదులఁ' గొన్ని మంత్రములఁ జెప్పుచు రాజుపై ప్రోక్షించును, దూర్వాదులతోఁ గూడఁ గొన్నివిధులఁ జేయుదురు.

తరువాత సింహాసనస్థుఁడగు రాజు నుద్దేశించియుఁ బ్రజల నుద్దేశించియు నధ్వర్యుఁడు కొన్నియంశములఁ జెప్పును.

(ఋగ్వేద, శుక్లయజుర్వేద, అధర్వవేదములలో సింహాసనము నెక్కినరాజును గూర్చి చెప్పిన యంశము లింపుగ నుండునుగాన, కొన్నిటి నిట వ్రాయుచున్నాను.

ఋ గ్వే ద ము

(1) ఓరాజా! నీమాతృదేవత నిన్ను గొప్పవారికంటె గొప్పవానినిగాను, ప్రజలను ధర్మముగాఁ బాలించువానినిగాను, కనుటచే నామె ధన్యురాలు సుమా!

శు క్ల య జు స్సం హి త

(2) ఓదేవతలారా! మీ రీరాజును శత్రువులు వైచు

(1) ఋ. మహాన్తం త్వా మహీనాం సమ్రాజం చర్షణీనాం
దేవీజని త్ర్యజీజన ద్భద్రాజని త్ర్య జీజనత్॥

(2) ఇమం దేవా అసపత్న గ్ం సువధ్యం మహతేక్ష
త్రాయ మహతే జ్యేష్ఠ్యాయ ఇమమము మము
ష్యపుత్రమస్యైవి శే॥ 11—3—2.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాణములను సహించి శత్రువులను నశింపఁజేయువానినిగాను క్షత్రియులలో నధికునిగాను, ప్రజలనందఱిని బాలించు వాని గాను జేయుఁడు. ఈరాజుయొక్క తలిదండ్రులు ప్రజాపా దక్షుఁడగు నీతనిఁ గనిన ట్లీతఁడును తనవలె సమర్థుఁడగు పుత్ర ని గనున ట్లాశీర్వదింపుఁడు.

(1) ఓ కురుదేశీయులారా! ఈతఁడు మీరాజు; ఓ పాం చాలదేశీయులారా! ఈతఁడు మీరాజు; బ్రాహ్మణుల మా మాకు సోముఁడు రాజు.

(2) ఓ రాజా! నాగులు నశించి యున్నారుగాన, ప్రా క్కు నధిరోహింపుము. గాయత్రి నిన్ను రక్షించుఁగాక.

పై మంత్రములలో మొదటిదానియందు కురు, పాంచా దేశపుప్రజల నుద్దేశించి యధ్వర్యుఁడు చెప్పు వాక్యముచేత రెండవ మంత్రములో 'దందశూకములు' నశించినవి గాన ప్రా క్కు నధిరోహింపుమని రాజు నుద్దేశించి యధ్వర్యుఁడు చెప్పు టచేతను, పై మంత్రములు ధర్మజుని రాజసూయ యాగము గాని, జనమేజయుని రాజసూయయాగమునఁ గాని యా వించినవా? యని తోఁచును.

---

(1) ఏషవః కురవోరా జైషవః పాంచాలా రాజా;
సోమోస్మాకం బ్రాహ్మనాగ్ రాజా. 11—6—8.

(2) ఆవేష్టా దందశూకాః ప్రాచీమారోహ।
గాయత్రీ త్వాఽవతు. 11—5.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ధర్మజుని రాజసూయయాగమునకుఁ బూర్వమె 'ఖాండవవన'దహన మగుటయు, అంర్జునిచే 'అశ్వసేనాది'నాగులలోఁ గొంద ఱోడి యన్యస్థలముల కేఁగుటయు మఱికొందఱు నశించుటయుఁ గల్గినది.

జనమేజయుని రాజసూయయాగమునకుఁ బూర్వమునను, 'సర్పయాగము' అను పేరితో ననేకులగు నాగులు జనమేజయునిచే హతముచేయఁబడుటయుఁ బ్రసిద్ధాంశము.

మఱియుఁ బై మంత్రములుగల 'శుక్లయజస్సులు' 'ఉద్దాలకుని' చే యాజ్ఞవల్క్యున కుపదేశింపఁ బడెనని 'శతపథబ్రాహ్మణ, బృహదారణ్యకోపనిషత్తుల'లోని 'వంశ'బ్రాహ్మణములు చెప్పుచున్నవి. యాజ్ఞవల్క్యుని గురువగు 'ఉద్దాలకుఁడు' పాండవపురోహితుఁడగు ధౌమ్యుని శిష్యుఁడని మహాభారతముననే కలదు. యాజ్ఞవల్క్యుఁడు జనమేజయుని యజ్ఞములలో 'బ్రహ్మత్వము'ను వహించె నని 'మత్స్యపురాణమునఁ' గలదు. పైకారణములచేఁ బై మంత్రము లాకాలముననే యావిర్భవించె నని చెప్పవలసియున్నది. ముందీయంశమింకను జర్చింపఁబడును.

## అ థ ర్వ వే ద ము.

(1) (అధ్వర్యుఁడిట్లు చెప్పుచున్నాఁడు) "ఎవఁడు భూ

(1) భూతో భూ తేషు పయ ఆదధాతి. స భూతానా మధిపతిర్బభూవ. తస్యమృత్యుశ్చరతి రాజసూయం. సరాజా రాజ్యమనుమన్యతా మిదమ్. 4—8—1.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తములయందు భూతమై, వానిసారమును గ్రహించెనో, ఆరా
భూతముల కధిపతియై యున్నాడు. అట్టిరాజు యొక్క రాజసూ
యమునుగూర్చి మృత్యువుకూడ వచ్చును.ఆరా జీరాజ్యము
నంగీకరించుఁ గాక!

(1) ఓ శత్రుహంతకా! బలవంతుఁడా! మిత్రవర్ధనా!
రాజా! దేవతలు నీకు బలమును గలిగించి నిన్నాశీర్వదించి,
నీవీరాజ్యము నేలుటకు వెనుదీయక మాయెదుటికి రమ్ము.

(2) "పులిచర్మముపై నెక్కిన యోపులీ! భూమియం
దన్నిదిక్కులను విక్రమింపుము. నీపరిపాలనమును సర్వజనుల
గోరుచున్నారు. స్వర్గమునందలి యుదకముతో భూమిని దడ
పుము. (జనులకు స్వర్గసుఖముల నొనగూర్చుము.)

(3) పులియందుండిన (పులిచర్మముపై నున్న) సింహ
మును, (రాజసింహమును) జనులు చుట్టుకొని సౌభాగ్యము
ఉత్సాహమును గల్గించుచున్నారు. మంచినీటి ప్రవాహ

---

(1) అభిప్రేహి మాపవేన ఉగ్రశ్చేత్తా సపత్నహా! ఆతిష్ఠ మిత్ర
వర్ధన! తుభ్యందేవా అధి బృవన్॥ 4—8—4.

(2) వ్యాఘ్రీ అధివైయ్యాఘ్రే విక్రమస్య దిశోమహీః విశస్త్వా
సర్వా వాంఛం త్వాపోదివ్యాః పయస్వతీః. 4—8—4

(3) ఏనా వ్యాఘ్రం పరిషస్వజానాః సింహం హిన్వంతి మహతే
సౌభగాయ సముద్రంన సుభువ స్తస్థివాంసం, మర్మృజ్యంతే
ద్వీపిన మప్స్వంతః॥ 4—8—7.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సముద్రమును బొందినయెడల నాసముద్రమును పెద్దపులి నీరి ప్రవేశించిదయెడల నాపులిని, జనులు నుతింతురుగదా.

ఐతరేయబ్రాహ్మణమునందు, 'జాబాలుఁడు, ఉద్దాలకుఁడు' అను మహర్షులు పునరభిషిక్తుఁడగు రాజునుగూర్చి కొన్నియంశములఁ జెప్పిరని కలదు. అం దుద్దాలకుఁడు మహారాజు సాక్షాత్తు పరమేశ్వరుఁడే యనినాఁడు. ఆయంశము లిట నప్రస్తుతమని విడువఁబడెను.

## రాజసూయ యాగకర్త సురాపానముఁ జేయుట.

పునరభిషేక సమయమునకు సిద్ధపఱచిన ద్రవ్యములలో 'సుర' యొకటి యని చెప్పఁబడెను. ఆమద్యము యొక్క ప్రాశస్త్య మెట్టిదో, దాని నెట్లుపయోగింపవలెనో, ఇట్లు వ్రాయఁబడుచున్నది,

(1) సుర (మదముఁ గలిగించునదిగాన) క్షత్రరూపమును, (వ్రీహ్యాద్యంకురములవలనఁ గలిగినది గాన) అన్నరసమునైయున్నది. ఈకర్మమునందు క్షాత్రమునే ధరించుచున్నది.

(2) "పిమ్మట (అధ్వర్యుఁడు) రాజసూయయాగకర్త యొక్కని హస్తములందు సురాయుక్తమగు కంచుపాత్రము నుంచవలెను."

---

(1) "అథ యత్సురాభవతి. క్షత్రరూపం.
తదథో అన్నరసః క్షత్రరూప వేవాస్మిం స్తద్దధాతి"
(2) "అథాస్మై సురాకంసం హస్త ఆదధాతి"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహారాజుచేతికి సురాపాత్రము నిచ్చి యిట్లధ్వర్యుఁడు చెప్పును.

(3) "సోమముతో సమానమగు నో సురా! రుచికరమైనట్టియు, మదకరమైనట్టియు, నీధారచే నీయజమానుని శోధింపుము. నీవింద్రునిపానముకొఱకు సోమముచే నభిషేకము నొందితివి గదా!"

అధ్వర్యుఁడిట్లు చెప్పి క్రిందియంశములతోఁ దాను శాంతిని జెప్పుచు మహారాజుచేఁ గూడఁ జెప్పించును.

(4) "ఓ సురాసోమములారా! దేవతలు హృదయాకాశమందు మీకు వేర్వేఱు స్థానముల నేర్పఱచియున్నారు. కాన మీరు హృదయమునంగలసియుండక, వేఱుగానెయుండుఁడు. (అట్లు కలిసిన సోమమునకు హానికలుగును.) ఓసురా! నీవు బలవతురాలవు. ఈసోముఁడు రాజు. కాన మీరుభయులును హృదయమునందలి మీమీస్థానములఁ బ్రవేశింపుఁడు. ఈపానము జేయువానిని హింసింపకుఁడు.

---

(3) స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమధారయా! ఇంద్రాయ పాతవే సుతః"

(4) "నానాహి వాం దేవహితం సదస్కృతం! మాసం సృక్షాథాం పరమే వ్యోమనీ, సురా త్వమసి శుష్మిణీ, సోమ ఏష రాజా, మైనం హింసిష్టం స్వాం యోని మావిశన్తావితి"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(1) "రాజు కాంస్యపాత్రిములోని సురను గొంతభాగము ద్రావి మిగిలినదానిని దనకు ముఖ్యమిత్రునకుఁ ద్రావనిచ్చును. ఏకపాత్రిములోని సురను ద్రాగుటయే మిత్రిత్వలక్షణము. అట్లుత్రాగినయెడల వారికన్యోన్యమైత్రియు, వారియందు సురకు మైత్రియు నుండును."

సురాపానానంతరము రాజుసింహాసనమునుండి దిగి 'నమో బ్రహ్మణే' అనువాక్యమును మూఁడుసారులు చెప్పి 'బ్రహ్మ' అనుఋత్విక్కునకు స్వజయముఁ గోరుచు గోవునీయవలయును. (అపుడే ప్రజల కేవేని బహుమానముల నిచ్చు సూచనయుఁ గలదు.)

పిమ్మట రాజు శత్రుజయమును తన కారోగ్యమునుగోరుచు యాగశాలనుండి స్వగృహమున కేఁగి 'గృహ్యాగ్ని లో' గూడ 'శత్రు, రోగాది' పరిహారములకై కొన్నియాహుతులను వేల్చును.

ఆకర్మాంతమునందు ఋత్విక్కు లాశీర్వదింతురు. ఇది 'ఆశ్వలాయనసూత్రము' ననుసరించిన రాజసూయయాగపద్ధతి.

---

(1) పీత్వా యం రాతిం మన్యేత. తస్మా ఏనాం ప్రయచ్ఛే త్తద్ధి మిత్రస్వరూపం. మిత్ర ఏవైనాం తదంతతః ప్రతిష్ఠాపయతి, తథాహి మిత్రే ప్రతితిష్ఠతి"

SRI JAGADGURU VISHWARADHYA JNANA SIMHASAN JNANAMANDIR LIBRARY Jangamawadi Math, Varanasi
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## రాజసూయయాగకర్త జూదమాడుట.

శుక్లయజుర్వేదీయులగు రాజులకు (కాత్యాయన సూత్రకులకు- వీరే కురు పాంచాల దేశీయులు) పునరభిషేకానంతరము రథారోహణవిధి చెప్పఁబడియున్నది.

(1) "అగ్నిచయమునందును, వాజపేయము నందును ఎట్లు యజమాని రథము నెక్కవలయునో, అట్లే రథము నెక్కవలయును." (రాజరథారోహణాదివిధు లిట నప్రస్తుతమని వి[illegible] వఁబడెను.)

రాజశీవితో రథముపైఁ గూర్చుండి ధనుర్ధరుఁడై కొంచెముమేర మిత్రాదులచేఁ బొగడఁబడుచు నేఁగి యొప్పటిస్థలమునకు వచ్చి రథమునుండి దిగి నూటికి మించిన బంగరునాణెములను స్పృశించవలెను.

(2) "పిమ్మట రాజు సింహాసనమునఁ గూర్చుండఁగా 'అధ్వర్యుఁడు' బంగరునగిషీగల యైదు 'పాచికలు' తెచ్చి రాజు చేతికీయవలయును."

రాజుద్యూత స్థానమునఁ గొన్ని బంగరు నాణెములుంచి యొక హోమముఁ జేసినతరువాతను ప్రధాన ఋత్విక్కులు నల్వురును (అధ్వర్యుఁడు, మొదలగువారును) రా[illegible]

---

(1) "అగ్నిచయనే వాజపేయే యథా రథారోహణం కృతం తద్వ దత్రాపి రథమారోహేత్"

(2) "అభిభూ రిత్యస్మై పంచాక్షా న్ప్రణిధాయేత్"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క పురోహిత పుత్రుఁడును, ఆయాస్థానముల నీక్రింది పేరులు రాజుచేఁ బెట్టించుకొని తిరిగి రాజునకే యాగుణముల నారోపించి చెప్పఁజూఁ గూర్చుందురు.

(1) నీవు బ్రహ్మవు; నీవు సవితవు; నీవు వరుణుఁడవు; నీ వింద్రుఁడవు; నీవు రుద్రుఁడవు; నీవు ప్రియంకరుఁడవు; అని రాజు ప్రధాన ఋత్విక్కులకును, పురోహిత పుత్రునకును, (ప్రియంకరుఁడ ననునది పురోహిత పుత్రున కిడిన నామము) నామముల నుంపఁగా, వారు రాజా! నీవు యజ్ఞదీక్ష నొందితివి గాన నీవే బ్రహ్మ వైతివి. నీ వమోఘానుశాసకుఁడవుగాన నీవే సవితవు. అనిష్టవారకుఁడవుగాన నీవే వరుణుఁడవు. ప్రజాబలము గలవాఁడవుగాన నీవే యింద్రుఁడవు. సుఖవంతుఁడవుగాన నీవే రుద్రుఁడవు. విస్తారమగు శ్రేయస్సుల నిచ్చువాఁడవుగాన నీవే ప్రియంకరుఁడవు. అని ఋత్విక్పురోహితపుత్రులు రాజును నుతింతురు. (పిమ్మట సుహృద్ద్యూతము జరుగును.)

## సౌ త్రా మ ణీ య జ్ఞ ము

ఆశ్వలాయన సూత్రికులు రాజసూయయాగానంతరము సౌత్రామణీయజ్ఞముఁ జేయవలయునని చెప్పఁబడలేదుగాని "ఆపస్తంబ, కాత్యాయన, సత్యాషాఢ" సూత్రికులు 'రాజసూయ

(1) "బ్రహ్మన్ త్వం బ్రహ్మాసి. సవితాసి సత్యప్రసవో వరుణోసి సత్యౌజా ఇంద్రోసి విశౌజా రుద్రోసి సుశేవః ప్రియకర శ్రేయస్కర భూయస్కరేతి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాగమునకు' అంగయజ్ఞముగా "సౌత్రామణీయజ్ఞమును జేయవలయు ననిరి. సౌత్రామణినిగురించి తైత్తరీయసంహిత లో నిట్లు కలదు.

(1) "రాజసూయయాగమునందును, అగ్నిచయనము నందును, లతాత్మకసోముఁడు బహువిధములుగా ఖండింపఁబడునుగాన, తద్దోషపరిహారముకొఱకు 'సౌత్రామణి' అను యజ్ఞముఁ జేయవలయును."

'సౌత్రామణీ, బృహస్పతి' సవములు కాలవిధాయక యజ్ఞములుగాను, అగ్నిచయన, రాజసూయములకు, సౌత్రామణియు, వాజపేయమునకు బృహస్పతిసవనమును అంగయజ్ఞములుగానుగూడ నుండును. ఆచర్చ యిట నప్రస్తుతము గాని, సౌత్రామణీయజ్ఞమునందు 'అన్నముతో బియ్యపుపిండిని గలిపి నిలవయుంచి పిండగా వచ్చు ద్రవ్యము (దానిని 'సైష్టి' యందురు.) హోమముచేయఁబడుటయు, హావిశ్శేషమును యజమానుఁడు, కొందఱుఋత్విక్కులు, భక్షించుటయు, ఆమదకర

---

(1) (ఏతత్) వై రాజసూయస్వరూపం......యశ్చ రాజసూయేః జానస్య యశ్చాగ్నిచిత ఇన్ద్రియస్యనుషవాణస్య దళ ధేంద్రియం వీర్యం పరా త తద్దేవా స్సౌత్రామణ్యా సమభరం త్సాయ తేవా ఏషయోగ్నించిను తే గ్నించిత్వా సౌత్రామణ్యా యజే తేంద్రియమేవ వీర్యగ్ సంభృత్యాత్మ ధత్తే"

తై. సం॥ 5-6-3-14.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్రవ్యమునందు బదరీ ఫలములనూరవేయుటయుఁ గలదని 'కాత్యాయన' శ్రౌతసూత్రములవలనఁ దెలియనగుచున్నది.

పైనుడువఁ బడిన 'పైష్టి' సురావిశేషమె! మఱియు ఐతరేయబ్రాహ్మణమునఁ జెప్పఁ బడిన 'సుర' వరిధాన్యము మొదలగువానిని మొలకఁగట్టి తీయఁబడినదని 'సాయణాచార్యులవారు' వ్రాసియున్నారు. ఎట్లయినను రాజసూయానంతరము మహారాజు మద్యపానమును మతము పేరితో జేయుట విధ్యుక్తమనియుఁ గొందఱిమహర్షులమతమున మద్యపానమేగాక, ద్యూతముకూడ విధియనియు స్పష్టమగుచున్నది. ద్యూతమెట్లుండినను, మద్యము 'శ్రౌతకర్మములందు, తాంత్రికకర్మములందు, వైద్యక్రియలయందు; విధిగావాడఁబోనఁబడినది. అందువలననే మనుస్మృతి—(1) 'మాంసభక్షణమునందును, మద్యపానమునందును, మిథునకర్మమునందును దోషములేదు. అది జంతుసాధారణధర్మమే; కాని మానుటమాత్రము మహాఫలము.' అని చెప్పెను.

మద్యపానమున కమితత్వముకూడ తాంత్రికగ్రంథములు చెప్పినవి.

---

(1) న మాంసభక్షణేదోషో నమద్యే నచమైథునే।
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలం॥ మనుస్మృతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(1) త్రాగితాగి, భూమిపైఁ బడువఱకుఁ ద్రాగి, తిరిగిలేచి త్రాగినవానికి జన్మరాహిత్యము కలుగును.

'చరక, బాహటాది' గ్రంథములు వ్యక్తిభేదము ననుసరించి మద్యపానార్హతానర్హతలను నిరూపించినవి. పై వ్రాయఁబడిన మద్యములు 'తాడి, ఈఁదు' చెట్లనుండి తీయఁబడిన మద్యములు కావు. 'మదిరార్ణవము' అను గ్రంథమునఁ బదునాలువిధము లగుమద్యములఁ గూర్చి చెప్పఁబడియున్నది. కాని, ప్రకృతమునం దమితముగాఁ బ్రభుత్వమున కాదాయముఁ గల్గించునదియు, బీదవారే హెచ్చుగ నుపయోగించునదియు నగు 'మద్యము' 'తాడి, ఈఁత' చెట్లనుండి వచ్చు మద్యమే యైయున్నది. దీనిని మూఁడేండ్లలో నరికట్ట ప్రభుత్వము (కాంగ్రెసు) ప్రతిజ్ఞ నూనినది. మూఁడు కాదు—ముప్పదియేండ్లకు సురాపానమును నివారించినను మిగుల సంతసమే కాని, ఇంతకుఁ ముందు వ్రాయఁబడిన 'స్పిరిట్' మొదలగు మద్యము లిప్పటి కల్లుయొక్క స్థానము నాక్రమించునేమో యనియు, విదేశీయులచేనేర్పఁబడి పాశ్చాత్య వర్తకసంఘములకు లాభముఁ గల్గించు 'టీ, కాఫీ' పానము లతిశయించునేమో యనియు భీతి కలుగుచున్నది.

---

(1) శ్లో॥ పీత్వాపీత్వా పునఃపీత్వా యావత్పతతి భూతలే।
పునరుత్థాయ వై పీత్వా పునర్జన్మ నవిద్యతే॥ కులార్ణవతంత్రే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భగ్నమైన మద్యపాన నిషేధశాసనకథ

మహాభారతమునందలి మౌసలపర్వమున, సురాపానము చేసినవారిని శూలారోపణముఁ జేయ 'ఉగ్రసేనమహారాజు' ద్వారకాపురిలో శాసించుటయేగాక, శ్రీకృష్ణ, బలరాముల యిండ్లయందైనను నాశాసనము వర్తించు నని చెప్పినను, స్వల్పకాలములోనె 'బలరామ, సాత్యకి, కృతవర్మా దులు' శ్రీకృష్ణునెదుటనె ద్వారకాపురి బహిఃప్రదేశమునఁ దెగఁద్రావి నట్లును, ఆమధుపానమత్తతచేతనె సాత్యకి కృతవర్మం దెగ వ్రేయ యాదవు లన్యోన్యకలహమున హతులైనట్లును గలదు.

ఈశ్వరానుగ్రహమునఁ బ్రస్తుత ప్రభుత్వపు మధుపాన నిషేధశాసనము పైరీతిని వ్యర్థము గాకుండుఁగాక !

మఱియు దేశీయులగు కల్లుగీతగాండ్రకు నష్టమును గల్గించి విదేశీయులకు లాభముఁగల్గించు 'కాఫీ, టీ' పానముల కీ శాసనము ప్రోత్సాహ మొసఁగకుండుఁగాక !

ప్రసక్తానుప్రసక్తముగ వచ్చు నితరాంశములను విడిచి, ప్రస్తుతమగు రాజసూయయాగాంశములఁజూతము. రాజసూయ యాగమును విద్వాంసులైన ఋత్విక్కులు చేయించకపోయిన యెడల యజమానుఁడు నష్టపడు ననియు, అట్లుకాక మంచి విద్వాంసులు చేయించినయెడల మహారాజునకు మహావిజయములు లభించుననియుఁ జెప్పఁబడెను. ఇందులకు 'పరిక్షిత్తు' పుత్రుఁడగు జనమేజయునివాక్యములు 'ఐతరేయబ్రాహ్మణమున' నిట్లుకలదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(1) అవిద్వాంసులైన ఋత్విజులు రాజసూయయాగముఁ జేయించినయెడల 'కిరాతులు, దొంగలు, పాపాత్ములు' ధనికుని గ్రహించి యరణ్యమునందు గోతిలోఁ బడద్రోసి ధనము నపహరించినట్లు రాజున కపజయముఁ గలుగురీతిఁ జేయించి యపకారముఁ జేసి ధనము నపహరింతురు. విద్వాంసులైన ఋత్విక్కులే నాచే యజ్ఞముఁ జేయించుటచే నేను ద్వంద్వయుద్ధమునందును, సేనతోఁ గూడిన యుద్ధమునందును, భయము లేకుండగ శత్రువులతోఁ బోరి శత్రువులను జయించుచున్నాను. శత్రువులు ప్రయోగించిన దివ్యాస్త్రములుగాని, మనుష్యకృతములగు నస్త్రములుగాని, నన్ను బాధింపలేదు. నేను సర్వభూమండలము నేలుచు సంపూర్ణాయుర్దాయము నొందఁగలను. అని విద్వాంసుఁడైన పరిక్షిత్పుత్రుఁడగు జనమేజయుఁడు చెప్పెను—

(1) అథహ తంవ్యేవ కర్షంతే. యథాహవా ఇదం నిషాదావా, సేలగావా, పాపకృతోవా, విత్తవంతంపురుష మరణ్యే గృహీత్వా కర్త మన్వస్య విత్తమాదాయ ద్రవం త్యేవమేవ తమృత్విజో యజమానం కర్తమన్వస్యవిత్తమాదాయ ద్రవంతి. యమ నేవంవిదో యాజయం త్యేతద్ధ స్మవై తద్విద్వానాహ జనమేజయః పరిక్షిత ఏవంవిదంహివై మా మేవం విదోయాజయంతి. తస్మాదహంక్షిజయా మ్యభీత్వరీం సేనాం. జయామ్యభీత్వర్యా సేనయా నమా దివ్యా నమానుష్య ఇషవ ఋచ్ఛం త్యేష్యామి సర్వమాయుః సర్వభూమి ర్భవిష్యామీతి.

ఐతరేయబ్రాహ్మణ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంతకుఁ బూర్వము 'మహాభారతము'నకుఁ బంచమవేద త్వమెట్లు కలిగెనో యాయంశమును, రాజసూయయాగమున నేమేయంశము లెట్లు జరుగునో యాయంశములను, నాతివిపుల ముగాఁ జర్చింపఁబడెను.

ఇఁక మహాభారతమున రాజసూయ యాగాంశములెట్లు విపులముగా వివరింపఁబడెనో యవి వ్రాయఁబడును.

ఇది

శ్రీ కౌండిన్యగోత్రపవిత్రుఁడును పెంజ్యాలవంశజుఁడును,
రామాంబా వేంకయాహ్వయుల ప్రథమపుత్రుఁడును,
'వ్యవసాయ, మహాభారత, పరీక్షిచ్చరిత్రాది'
బహుగ్రంథకర్తయు నగు వేంకట సుబ్ర
హ్మణ్యశాస్త్రిచే రచింపఁబడిన
'రాజసూయ రహస్యము'
నందు ప్రథమభాగము.

శ్రీ శ్రీ శ్రీ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ధర్మజరాజసూయము.

## ద్వితీయభాగము.

——:0:——

దృశ్యమాన మహాభారతము 'జయ, భారత' గ్రంథ రూపముల నొంది, తుదకు మహాభారత గ్రంథరూపముగాఁ బరిణమించిన దనియు, తుదిగ్రంథమునకే పంచమవేదత్వము కలిగినదనియు నిదివఱకు వ్రాసియున్నాను. పై మూఁడు గ్రంథరూపములకును మూఁడు కథానుక్రమణికలు ఆదిపర్వముననె మూఁడు విధములుగాఁ గలవు. అందు 'జయ'మను నితిహాస రూపమునకు అఱువది యొక్కవ యధ్యాయమున నేఁబది శ్లోకములును, భారతమనుదానికి మొదటి యధ్యాయములో నూట పదునేడవ (117) శ్లోకము మొదలు రెండువందల యిరువది మూఁడవ (223) శ్లోకాంతమువఱకునుగల నూటయాఱు(106) శ్లోకములును మహాభారతమను తుది గ్రంథమునకు రెండవ యధ్యాయమున నెనుబది తొమ్మిదవ (89) శ్లోకము మొదలు మూఁడువందల యఱువది తొమ్మిది (369) శ్లోకము వఱకును గల రెండువందల యెనుబది శ్లోకములును (280) అనుక్రమణికలై యున్నవి. అనఁగా, ఏకోత్తరాభివృద్ధిగా గాథలు పెరిగి యున్నవనుట! ఇందు ధర్మజుని రాజసూయయాగపు గాథలును, దానికి సంబంధించి పూర్వోత్తరములఁ గలిగిన గాథలును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ఇంద్రప్రస్థ నిర్మాణము మొదలు సుహృద్ద్యూతాంతమువఱకు) నెట్లు వృద్ధి నొందెనో చూడుఁడు.

-⁂⁂ మొదటి రూపము. ⁂⁂-

(1) పాండవు లంతటను రత్నములను సంపాదించి, ఇంద్రప్రస్థమును నిర్మించి యనేక సంవత్సరము లట నివసించిరి. ధర్మప్రధానులు సత్యవ్రతపరాయణులు నగుచు, వారు శస్త్ర ప్రతాపముచే శత్రురాజులను స్వాధీనపఱచుకొనిరి...ఆకాలమున భీముఁడు ప్రాగ్దిక్కును, బీభత్సుఁ డుత్తరదిశను, నకులుఁడు

(1) శ్లో॥ నగరం ఖాండవప్రస్థం రత్నాన్యా దాయ సర్వశః।
తత్ర తేన్యవసన్ పార్థాః సంవత్సరగణాన్ బహూన్॥
వశే శస్త్రప్రతాపేన కుర్వంతో న్యా న్మహీభృతః।
ఏవం ధర్మప్రధానాస్తే సత్యవ్రతపరాయణాః॥
...... అజయద్భీమ సేనస్తు దిశంప్రాచీం మహాయశాః।
ఉదీచీ మర్జునోవీరః ప్రతీచీం నకులస్తథా।
దక్షిణాం సహదేవస్తు విజిగ్యే పరవీరహా॥
ఏవంచక్రు రిమాంసర్వే వశేకృత్స్నాం వసుంధరాం।
...... తతో నిమిత్తే కస్మింశ్చి ద్ధర్మరాజో యుధిష్ఠిరః॥
వనంప్రస్థాపయామాస తేజస్వీ సత్యవిక్రమః।
ప్రాణేభ్యోపి ప్రియతరం భ్రాతరం సవ్యసాచినం॥
...... సవై సంవత్సరం పూర్ణం మాసంచైకం వనేవసత్॥
తతో గచ్ఛద్ధృషీకేశం ద్వారవత్యాం కదాచన।
లబ్ధవాం స్తత్రబీభత్సు ర్భార్యాం రాజీవలోచనాం।
అనుజాం వాసుదేవస్య సుభద్రాం భద్రభాషిణీం॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పశ్చిమాశను, సహదేవుఁడు దక్షిణదిశను జయించిరి. ఈరీతిని వారు భూమిని స్వాధీనపఱచుకొనిరి. పిమ్మట నొకకారణముచే ధర్మజుఁడు ప్రాణములకంటెను బ్రియుఁడైన యర్జునుని వనమున కంపవలసివచ్చెను......ఆయర్జునుఁడు పదుమూఁడు మాసములు వనమున నివసించి, పిమ్మట నొకప్పుడు ద్వారకాపురి కేఁగి యట శ్రీకృష్ణుని గలిసికొనెను. ద్వారకయందు శ్రీకృష్ణసోదరియు సుగుణయు, సౌందర్యవతియు నగుసుభద్ర నర్జునుఁడు పెండ్లియాడెను.

......అర్జునుఁడు శ్రీకృష్ణసహాయముతో ఖాండము నగ్నిపాలు చేసెను....అగ్ని యర్జునునకు గాండీవమును, అక్షయతూణీరములను, కపిధ్వజముగల దివ్యరథము నిచ్చెను. ఖాండవవనముననే యర్జునుఁడు మయాసురుని రక్షించెను. ఆమయుఁడు సర్వ

... ... అతర్పయచ్చ కౌంతేయః ఖాండవే హవ్యవాహనం।
బీభత్సు ర్వాసుదేవేన సహితో నృపసత్తమ.

... ... పార్థాయా గ్నిర్దదౌచాపి గాండీవం ధనురుత్తమం॥
ఇషుధీ చాక్షు య్యౌర్బాణై రథంచ కపిలక్షణం।
మోక్షయామాస బీభత్సు ర్మయం యత్రమహాసురం॥
సచకార సభాం దివ్యాం సర్వరత్నసమన్వితాం।
తస్యాం దుర్యోధనోమందో లోభంచక్రే సుదుర్మతిః।
తతో౽క్షైర్వంచయిత్వాచ సౌబలేన యుధిష్ఠిరం।
వనంప్రస్థాపయామాస సప్తవర్షాణి పంచచ॥—
ఆదిపర్వ॥ 61 అధ్యా॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రత్నమయమగు సభను నిర్మించి పాండవులకిచ్చెను. ఆసభను జూచి మందుఁడగు దుర్యోధనుఁడు లోభించి, పాచికలచే శకుని ధర్మరాజును వంచించునట్లుచేసి, పండ్రెండేడులు పాండవులను వనమున కంపెను.

## రెండవసారి వృద్ధినొందిన భాగములు.

(1)...అర్జునుఁడు యుద్ధములయందు సూర్యునివలెఁ జూడశక్యముకానివాఁ డయ్యెను. ఆతఁడు రాజుల నందఱిని, పార్వతీయాదిగణములను, ఒక్కొక్కసారిగా జయించెను. అర్జునుఁడు, అన్నప్రదానబహుళము, భూరిదక్షిణాయుతము నగు రాజసూయయాగమును ధర్మజునికొఱకు తెచ్చెను. శ్రీకృష్ణుని

(1) శ్లో॥ ........ఆదిత్య ఇవదుష్ప్రేక్ష్య స్సమరే ష్వర్జునోఽభవత్ ॥
ససర్వాన్ పార్థివాన్ జిత్వా గణా నేకైకశోబలీ।
ఆజహారా ర్జునోరాజ్ఞే రాజసూయం మహాక్రతుం॥
అన్నవాన్ దక్షిణావాంశ్చ సర్వై స్సముదితో గుణైః।
యుధిష్ఠిరేణ సంప్రాప్తో రాజసూయోమహాక్రతుః॥
సునయాద్వాసుదేవస్య భీమార్జునబలేనచ।
ఘాతయిత్వా జరాసంధం చైద్యంచ బలదర్పితం॥
దుర్యోధనం వినాగచ్ఛ న్సర్వ్వాణాని తతస్తతః।
మణికాంచనరత్నాని గో హస్త్యశ్వ రథానిచ॥
...... సమృద్ధాం తాం తథాదృష్ట్వా పాండవానాం తదాశ్రియం।
ఈర్ష్యాసముత్థ స్సుమహాం స్తస్యమన్యు రజాయత॥
విమానప్రతిమాంచాపి మయేనసుకృతాం సభాం।
పాండవానా ముపహృతాం సదృష్ట్వా పర్యతప్యత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నైపుణ్యముచేతను, భీమార్జునులబలముచేతను, 'జరాసంధుని, శిశుపాలుని' జంపించి ధర్మరాజు రాజసూయయాగము నొనర్చెను. దుర్యోధనుఁడు వినాగా నక్కడక్కడి రాజులయొక్క మణికాంచన గోహస్త్యశ్వ రథాదులగు కానుకలు ధర్మజు నొందెను. అపుడు సమృద్ధమైన యామైశ్వర్యమును జూచి, దుర్యోధనున కీర్ష్యాకోపములు జనించెను. విమానతుల్యమై, మయునిచే నిర్మింపఁబడి పాండవుల కీయఁబడిన సభను జూచి పరితపించుటయేగాక, యచటనే కాలుజారి తొట్రుపడుచు దుర్యోధనుఁడు, శ్రీకృష్ణుఁడు చూచుచుండఁగనే భీమునిచే నీచనిమాడ్కి పరిహసింపఁబడెను—పిమ్మట దుర్యోధనుఁడు వివర్ణుఁడై నీరసించి పాలిపోయి తనబాధను ధృతరాష్ట్రునకుఁ జెప్ప నాతఁడు దుర్యోధనునందు ప్రేమకలవాఁడై ద్యూతమున కనుజ్ఞ నిచ్చెను.

—ః— మూఁడవతడవ పెంపొందినది —ః—

(1) "రాజ్యార్థలాభంబును, ఖాండవప్రస్థనివాసంబును

---

యత్రాపహసిత శ్చాసీ త్ప్రస్థలన్నివ సంభ్రమాత్॥
ప్రత్యక్షం వాసుదేవస్య భీమేనానభిజాతవత్॥
... ... కథితో ధృతరాష్ట్రశ్చ వివర్ణోహరిణః కృశః॥
అన్వజానా త్తతోద్యూతం ధృతరాష్ట్ర స్సుతప్రియః॥
ఆదిపర్వ॥ 1 అధ్యాయః॥

(1) మూఁడవసారి రూపొందిన మహాభారతమే, దృశ్యమానమహాభారతము; దీనికి నాదిపర్వము రెండవయధ్యాయమున ననుక్రమణిక కలదు. దానిని సంపూర్తిగ నన్నయమహాకవియె యాంధ్రీకరించెను గాన దానినె యిట వ్రాయుచున్నాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుందోపసుందోపాఖ్యానంబును, నారదవచనంబున ద్రౌపది యందు సమయక్రియయును, నర్జునుతీర్థాభిగమనంబును, నులూపీసమాగమంబును, చిత్రాంగదయందు బభ్రువాహను జన్మంబును, ద్వారకాగమనంబును, వాసుదేవానుమతంబున నర్జునుండు సుభద్రను వివాహంబగుటయు, సుభద్రాహరణంబును, హరణహారికయు, నభిమన్యుసంభవంబును, గాండీవ దేవదత్త దివ్య రథాశ్వలాభంబును, ఖాండవదహనంబును, నగ్నిభయంబువలన మయభుజంగమోక్షణంబును, మందపాలోపాఖ్యానంబును, ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ, గింకరదర్శనంబును, నారదువలన లోకపాలసభాశ్రవణంబును, రాజసూయమహాధ్వరారంభంబును, జరాసంధవధయును, గిరివ్రజనిరుద్ధులైన రాజులఁ గృష్ణుండు విడిపించుటయును, దిగ్విజయంబును, రాజసూయంబును, నర్ఘ్యాభిహరణంబును, శిశుపాలవధయును, రాజసూయవిభూతికి దుఃఖితుండై సభాస్థలితుండై యున్న దుర్యోధనుం జూచి ద్రౌపదీభీమసేనులు నగుటయును, దత్కారణంబున జూదంబాడుటయు, నందు శకునికైతవంబున ధర్మరాజపరాజయంబును" అనునవి కలవు.

## -ఠఠ కథావివరణము ఠఠ-

పై నాఁబడిన మూఁడువిధములగు గాథలలోను, మొదటిగాథలుగల గ్రంథము కురుక్షేత్రయుద్ధానంతరము కృష్ణ ద్వైపాయనుఁడు మూఁడేండ్లను వ్రాసియున్నాఁడు. ఆగ్రంథము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఎనిమిదివేల యెనిమిదివందల' (8800) శ్లోకములుకలది. రెండవ సారి వృద్ధిచేయఁబడి; మొదటిగ్రంథభాగముల నడుమనిమిడింపఁ బడి పెంపఁబడినగ్రంథము, కురుక్షేత్రయుద్ధానంతరము రమారమి నూతేండ్లకు 'ఇరువదినాలుగువేల (24000) శ్లోకములు కలదై వైశంపాయనునిచేఁ జెప్పఁబడినది.

మూఁడవసారి పెంపఁబడిన గ్రంథము వైశంపాయనునకుఁ బిమ్మటఁ గొంతకాలమునకు 'సౌతి' చేఁ బై రెండుగ్రంథముల నడుమను శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులు స్వేచ్ఛగ నిముడ్చి లక్షశ్లోక (100000) రూపకగ్రంథముగాఁ జెప్పఁబడినది.

పిమ్మటనింకను ననామధేయకవులు పై మూఁడింటను, దమగ్రంథములఁ జేర్చియు, పూర్వగాథలను గొన్నిటిఁదీసివేసియు కలగలుపుచేసియున్నారు. పై మూఁడువిధములగు గ్రంథములకు ను వరుసగా 'జయ, భారత, మహాభారతములు' అని నామము లేర్పడినవి. (1)ఆమూఁడు గ్రంథములలోను మొదటిదగు 'జయ' మునందు "ఇంద్రప్రస్థరాజ్యము నొందినతరువాతను'భీమార్జున నకుల సహదేవులు' వరుసగా 'ప్రాగుత్తర పశ్చిమ దక్షిణ దిక్కులను' జయించుటయు, అర్జునుఁ డొకకారణమునఁ బదుమూఁడుమాసములు వనమున నివసించుటయు సుభద్రాపరిణయమును ఖాండవవనదహనమును, అర్జునునకు గాండీవాద్యాయుధ ప్రాప్తి

(1) 'జయ, భారత, మహాభారతములఁ' గూర్చి నామమహాభారత చరిత్రమున విపులముగాఁ జర్చింపఁబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు మయునిరక్షింప, నాతఁడు వివిధరత్నశోభితమగు సభను నిర్మించి ధర్మజునకిచ్చుటయు, సభనుఁజూచి, దాని నపహరింపు తలంపుతో దుర్యోధనుఁడు మాయాద్యూతముచే, శకునికైతవమున ధర్మజునోడించి పాండవులను బదిరెండేడులు వనమున కంపుటయుఁ'' గలవు.

ఇందు దృశ్యమానమహాభారతమునందలి 'సుందోపసుందోపాఖ్యానము, ఉలూపీ చిత్రాంగదా పరిణయములు, శ్వేతకిగాథ, మందపాలోపాఖ్యానము, లోకపాలసభావృత్తాంతము, జరాసంధచరిత్రము, తద్వధము, పాండవదిగ్విజము, రాజసూయయాగము, అనుద్యూతము' అనునవిలేవు. పాండవుల దిగ్విజయము అర్జునువనవాస గమనమునకుఁ బూర్వముననే చెప్పఁబడినది.

రెండవదగు భారతమున, "మహాబలవంతుఁ డగునర్జునుఁ డనేకగణములను (నాగ రాక్షస గణములు లేక, చోర, పార్వతీయగణములు) జయించి ధర్మజునకు రాజసూయముఁ దెచ్చెను. వాసుదేవుని నీతిచేతను, భీమార్జునుల బలముచేతను,జరాసంధుని, శిశుపాలుని, చంపించి ధర్మజునిచేరాజసూయము పొందఁబడెను. దుర్యోధనుఁడు గాక తక్కినరాజు లిచ్చు మణికాంచనాదులగు కానుకలు పాండవుల నొందెను. అప్పటి పాండవుల వైశ్వర్యమును జూచి, దుర్యోధనునకీర్ష్యకలిగెను. గొప్పదగు మయసభనుగూడ దుర్యోధనుఁడు చూచి పరితపించెను. సభలో కాలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జారి పడగా వాసుదేవునిసన్నిధినే భీముఁడు దుర్యోధనుని నీచ
మగు హేళనముఁ జేసెను. దుర్యోధనుఁడు ధృతరాష్ట్రునకుఁ
దనపరివేదనముఁ జెప్పగా నాతఁడు ద్యూతమున కనుజ్ఞ నిచ్చెను,
అనునవి చేర్పఁబడెను.

ఈ రెండవమార్పునందు, అర్జునుఁడె దిగ్విజయయాత్రచేసి
రాజసూయముఁ జేయించెననుటయు, దుర్యోధనుఁడు మయసభ
లో జారిపడగా కృష్ణునిసన్నిధినే నీచముగా భీముఁడు పరిహసించె
ననుటయు, దృశ్యమాన మహాభారతమున లేవు. దుర్యోధనుని
ద్రౌపదీభీములు పరిహసించినట్లున్నది. కృష్ణసాన్నిధ్యమని లేదు.
మొదటిగ్రంథమునకు 'జరాసంధ, శిశుపాలుర' హత్యలు రాజ
సూయమును ధర్మజుఁ డొనర్చుసందర్భమునఁ జేయఁబడినవను
నంశములును, దుర్యోధనహితైషియై ధృతరాష్ట్రుఁడు ద్యూత
మున కనుజ్ఞ నిచ్చుటయుఁ జేర్పఁబడెను.

మూఁడవదగు మార్పునందు 'సుందోపసుందోపాఖ్యాన
ము, ద్రౌపదీవిషయక పాండవసమయనిష్ఠ, అర్జునకృత గోబ్రా
హ్మణరక్షణక్రియ, సమయభంగము, తీర్థయాత్ర, ఉలూపీసమా
గమము, చిత్రాంగదాపరిణయము, శ్వేతకి మందపాలోపాఖ్యా
నములు, ఇంద్రార్జునయుద్ధము, లోకపాలసభావర్ణనము, జరా
సంధచరిత్రము, పాండవకృతదిగ్విజయము, శిశుపాలచరిత్రము'
మొదలగువిశేషాంశములు మొదటిరెండుగ్రంథములకంటె ననేక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మడుగులు పెంపఁబడి మొదటిరెండింటిగాథలనడుమ నిముడ్పఁ బడినది.

ఇందు చారిత్రకాంశము లెంతవఱకు? ధృతరాష్ట్రునిచే ఖాండవప్రస్థరాజ్య మీయఁబడెనేకాని, అది బహు క్రూరమృగాకీర్ణమును, వివిధానాగరిక చోరగణపరీవృతము నైన భయంకరప్రదేశము. అందువలననే ధృతరాష్ట్రుఁ డిందప్రస్థరాజ్యము నిచ్చునపుడే యిట్లనియున్నాఁడు.

(1) "ఓ ధర్మరాజా! మీరు ఖాండవప్రస్థమున నివసించునపుడు, దేవతలనింద్రుఁడు రక్షించునటుల మిమ్ము నర్జునుఁడు రక్షించుటచే నెవఁడును మిమ్ము బాధింపలేఁడు." అనిచెప్పెను. మఱియ,పురాణాంతరమున నిట్లుకలదు.

క. ఇంద్ర విభవమున నీగతి
నింద్రప్రస్థంబు చేర • నేఁగఁగ నదియుఁ
రుంద్రమృగాకీర్ణంబై
సాంద్రలతా గుల్మ సాల • సంవృతమగుటన్.

* * * * *

మ. ధృతరాష్ట్రుం డతిరోషదూషితుఁడు ధా
త్రీభాగదానోప ధి

---

శ్లో॥ నచవో వసతస్తత్ర కశ్చిచ్ఛక్తః ప్రబాధితుం।
సంరక్ష్యమాణాన్ పార్థేన త్రిదశానివ వజ్రిణా ॥
ఆదిపర్వ. 207 అధ్యా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థితి నీకానన మిచ్చె జ్ఞాతిజను లి
సీ ! జ్ఞాతి సద్వైభవో
న్నతి సైరింపఁగ నోపువారె ! పలుకుల్
నవ్యామృతాసారముల్
మతి దీప్తాగ్నియ పో ! సగోత్రులకుఁ ద
న్మాహాత్మ్యముల్ వింతవే.

ఆ. ఇమ్మహోగ్రవిపిన • మెట్లు పురంబుగాఁ
జేయువాఁడ ననుచుఁ • జింతఁ గలఁగి
యంబుజాయతాక్షు • నడిగిన నమ్మహా
పురుషుఁ డనియె ధర్మ•పుత్రుతోడ.

(ధర్మఖండము.)

ఖాండవప్రస్థము నంటియే ఖాండవమహావనము ప్రాగ్ద క్షిణ భాగములను వ్యాపించి యున్నది. ఆవనమున బలవంతు లగు 'తక్షక, అశ్వసేన, శ్రుతసేనాది' నాగగణ ముఖ్యులును (కుండలాపహరణ పర్వమున తక్షకుఁడు చోరముఖ్యుఁడుగా వర్ణింపఁబడెను.) మయాదిరాక్షసులును, మఱికొందఱు భూతగణ జాతిజనులు నివసించియుండిరి. మఱియు నావనము వివిధము లగు జలవసతులు గలిగి, బహువిధామూల్యరత్నాకరముల కునికిపట్టై, ఇటలీవారిచే నిపుడాక్రమింపఁబడిన 'అబిసీనియా' వలె నుండెడిది. అట్టిఖాండవ వనమును స్వాధీనపఱచుకొనుటయే పాండవుల ముఖ్యాశయము. దానిలోని బలవంతులఁ బారఁదో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లుటయో లేక నిర్జించి స్వాధీనపఱచుకొనుటయో ముఖ్యకర్త వ్యము. ఇంతమాత్రమెకాక, క్రూరమృగములను హతమార్చి వ్యవసాయిక ప్రదేశముగాఁజేసి, భూగర్భస్థములగు వివిధరత్నా దివస్తువులను సంపాదింపవలయును; అందులకు ధర్మజుఁ డేమిచే సెనో చూడుఁడు.

అర్జునుఁడు బ్రాహ్మణుని గోవులను దస్యు లపహరించు చున్నారని విని చోరులఁ బారఁదోలు తొందరచే ద్రౌపదీ ధర్మ జులుండిన యాయుధాగారమున కేఁగె ననుకారణమున ధర్మజుఁ డర్జునుని బదిరెండువత్సరములు వనవాసము చేయవలయు నను నియమము ననుసరించి బ్రాహ్మణులు, సేవకులు, భిక్షుకులు, మొదలగువారితో గంగానది నంటిన ప్రాగ్భాగమున సంచరింప నంపెను. కళింగదేశపుసరిహద్దునఁ గొందఱు సేవకులఁ దప్ప త క్కినవారి నట నర్జునుఁడు వదలివేసెను.

బ్రహ్మచర్యముతోఁ బండ్రెండేడులు సంచరింపవలయు నని యర్జునుఁడు నియమముతో వెళ్లినెగాని, తీర్థయాత్రకు వెడ లిన స్వల్పకాలములోనె 'ఉలూపి' యను వితంతునాగవనితను గూడి 'ఇరావంతుఁ'డను పుత్రునిగనెను. 'మణిపూరు' పురమున 'చిత్రాంగద' యను ద్రావిడవనితంగోర్కి పెండ్లాడి మూఁడేండ్లట నుండి 'బభ్రువాహనుఁ' డనుపుత్రుని బడసెను. తుదకు ద్వార వతికేఁగి, కృష్ణానుజ యగు 'సుభద్ర' నెత్తికొని వచ్చి 'అభి మన్యుని' గనెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉలూపియె వలచి కోరుటచే నామెను గూడుట (1) 'వామదేవ్యము' అను వేదోదిత ధర్మమగునుగాని, 'చిత్రాంగదా, సుభద్రలం' బెండ్లియాడుట నట్టిదికాదుగదా! అదెట్టిబ్రహ్మచర్యమో?

ఆలోచింపఁగా నర్జునుఁడు తీర్థయాత్ర యను నెపముచే ప్రాగ్దక్షిణదేశములయొక్క రాజకీయరహస్యములఁ గనుఁగొనుటకు, ఖాండవవనప్రాంతములఁగల నాగులలో నన్యోన్యకలహములం బెంచుటకే చారాగ్రేసరుఁడుగా బ్రాహ్మణ, భిక్షుకాది, చారులతోఁ గూడి ధర్మజుచేఁ బంపఁబడియుండును.

అర్జునుఁ డులూపీ సంయోగముచే నాగులలో నన్యోన్య కలహములు సంభవించినవి. ఉలూపియం దర్జునునకుఁ బుట్టిన 'ఇరావంతుని' ఉలూపియొక్క ప్రథమభర్త యొక్క సోదరుఁడు పార్థునిపైఁగల పగచే స్వదేశమునుండి తరిమివేయఁగా నాయిరావంతుఁ డర్జునుఁడు దివ్యాస్త్రసంపాదనముకై స్వర్గలోకమున నుండగా నటకేఁగి స్వవృత్తాంతముఁ జెప్పికొనెను. (2)

---

(1) తన్ను వలచివచ్చినయామెను దప్పక పొందవలయును. అది వామదేవ్యవ్రతము; పుణ్యహేతువు. అని 'ఛాందోగ్యోపనిషత్తు'నఁ జెప్పఁబడెను. అర్జునుఁడు పండ్రెండుమాసములే బ్రహ్మచర్యవ్రతముతో వనవాసము సల్పెనని పాఠాంతరము కలదు. కాని యాతఁడు పండ్రెండేడులే దేశాంతరవాసియైనట్లును, అందు మూఁడేండ్లు 'మణులూరు'పురముననే యుండినట్లును, అన్ని ప్రతులలోను గలదు.

(2) భీష్మపర్వ. 91 అధ్యా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇందువలన నర్జునుఁడు నాగజాతియం దన్యోన్యకలహములఁ బెట్టినట్లు స్పష్టముకాఁగలదు. కళింగద్వారమునఁ బెక్క-ండు బ్రాహ్మణాదుల నర్జునుఁడు విడిచి వెళ్లుటకూడ వారు ఖాండవవనప్రాంతమునఁ గల రహస్యములఁ దెలిసికొనుట కేమొ? అర్జునుఁడు 'చిత్రాంగదా, సుభద్రలం' బెండ్లియాడుటచే స్వపక్షబలాభివృద్ధి కలిగినది.

ఇట్టివి ప్రస్తుతకాలమునందు 'అబిసీనియా' యుద్ధమునకుఁ బూర్వ మాదేశమునందు, 'ఇటలీ' నియంతయగు 'మసులోనీ' చేయించిన తంత్రములవంటివిగావా?

శ్రీకృష్ణునితో సంబంధబాంధవ్యములు కలిగిన తరువాత నర్జునుఁడు ఖాండవవన దహనముఁ జేసి యందలి 'నాగ,భూతాది' గణములను రూపుమాపెను. ఆఖాండవవన దహనకర్మము 'ఇటలీ, జపానులు' ప్రస్తుతకాలమునందు 'అబిసీనియా, చైనా' దేశములలోఁ జేసిన—చేయుచున్న—మారణమహాకర్మములఁ దలఁదన్నిన దనవచ్చును. ఆమహావనమునందలి ప్రాణులలో నాలుగు శార్ఙ్గపక్షిశిశువులును, ఎగిరిపోయిన వానితల్లియు, మాయచే నదృశ్యుఁడగు 'అశ్వసేనుఁడు' అను తక్షకపుత్రుఁడును, పార్థునకు శరణుచొచ్చిన 'మయుఁడును' దప్ప, తక్కిన సమస్త యక్ష రాక్షసగణములును, సమస్త మృగపక్ష్యాదులును, మలమల మాడ్పఁబడినవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆఖాండవ వన దహనాంశములు, సంస్కృతభారతమున మహాదారుణముగానె వర్ణింపఁబడినను, నన్నయభట్ట మహాకవి కృష్ణార్జున పాత్రములయందు కూరత్వమును జూపుట కిష్టము లేకకాఁబోలు మార్దవముగానె యాంధ్రీకరించియున్నాఁడు. ఆ మార్దవ యుక్తాంధ్రీకరణము కూడ నెట్లుండెనో చూడుఁడు.

చ. పెడిలి సువర్ణపర్వతము ♦ పెక్కు దెఱంగుల వ్రియ్యునట్టుల
   స్పడు వివిధప్రకారముల ♦ భూరిశిఖావలి ఖాండవంబు న
   ల్గడఁ గడుఁబర్వఁగాఁ బెఱెగి ♦ కాల్పఁదొడంగెహుతాశనుండు;నే
   డ్పడఁగ వనంబులోని మృగ ♦ పక్షిభుజంగమభూతసంఘముల్.

వ. అంత.

సీ. చక్రధరుండయ్యు ♦ జలరుహనాభుండు
                గాండీవధరుఁ డయ్యుఁ ♦ బాండవుండు
   నుండి రవ్వనమున ♦ నుభయపార్శ్వంబులఁ
                దొల్లింటియట్టుల ♦ పెల్లురేగి
   యనలంబు నార్పంగ ♦ నార్చుచుఁ బఱతెంచి
                వనరక్షకులు పార్థు ♦ సునిశితాస్త్ర
   ధారల నపగత ♦ దర్పులై యరిగిరి
                యమసదనంబున ♦ కమితబలులు

ఆ. శిఖియు నుగ్ర దీర్ఘ ♦ జిహ్వాలు సాచి యు
   ద్ధుర సమీరణంబు ♦ తోడుచేసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొని యుగాంతకాల ♦ కుపితానానాకారుఁ
డయ్యె ఖాండవమున ♦ కద్భుతముగ.

※ ※ ※ ※ ※

చ. జ్వలనశిఖాళియున్ విజయు♦సద్విశిఖాళియు జుట్టుముట్టి నం
దలరి భయాకులంబులగు ♦ తద్వనజీవుల యార్తనాద మం
దులియుచు నొక్కపెట్ట దిశ♦నుద్ధతమయ్యె నమందమందరా
చల పరివర్తనప్రసభ ♦ సంక్షుభితార్ణవఘోష ఘోరమై.

క. నెగయుచు నెగసి పిరుందం
దగిలెడు మిడుగురులచేత ♦ దగ్ధచ్ఛదమై
గగనమునఁ బఱవనోపక
ఖగనివహము వహ్నియంద ♦ కడువడిఁ బడియెన్.

క. తన తేజోజాలము ప
ర్వినదగ్ధములగు ననేక♦విధదేహులఁ దే
హానికాయంబుల బహువిధ
తనువులు కలవాఁడపోలె ♦ దహనుం డొప్పెన్.

చ. అమితకృశాను దగ్ధమగు ♦ నయ్యమరేంద్రువనంబులోనియు
త్తమసలిలాశయానళుల ♦ తప్తజలంబులయం దపేతజీ
వములయి తేలుచుండె వర♦వారిచరంబులు వారిపక్షులుం
గమరె నశేషకోకనద♦కైరవపంక్తులు శైవలంబులున్.

క. అలుగులవడి ఖాండవమునఁ
గలయాశీవిషమహోర♦గము లెల్ల విషా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్నులు గ్రిక్కుచు నత్యుగ్రా
నలబహుబజ్వాలలందు • నాశము నొందెన్.

* * * * *

తే. దాని వెల్వడ నేరక • తద్వనంబు
జీవు లెల్లను బావక•శిఖలఁ జేసి
దగ్ధులగుచున్నఁ దక్షక•తనయుఁ డశ్వ
సేనుఁ డను భుజంగమ మగ్ని•శిఖల కపుడు.

ఆ. వెఱచి తల్లి తోఁక • గఱపించుకొని దివిఁ
బఱచువానిఁ జూచి • పార్థుఁ డలిగి
వానితల్లిశిరము•తోన తత్పుచ్ఛంబు
దునిసి యగ్నిశిఖలఁ • దొరఁగనేసె.

వ. వెండియు నశ్వసేనునేయ నమకట్టిన యప్పార్థునకుఁ దక్షణంబ
మోహిని యను మాయ గావించి యమరేంద్రుఁ డశ్వ
సేను విడిపించె—

పై ఖాండవదహనమున, 'తక్షకునిభార్య' నాగవనిత
పార్థునిచే వధింపఁబడెను. కాని ఖాండవదహనము అగ్నిదేవతా
ప్రీతికై చేయఁబడిన కర్మమగుటచేతను, అది 'ఇష్టము' అను
శ్రౌతకర్మముగా నెన్నఁబడుటచేతను, స్త్రీహత్యాది పాపకర్మ
ముగా భారతీయులచేఁ బరిగణింపఁబడలేదు. కాని 'ఇటలీ,
జపాను'ల మారణకర్మములు భారతీయుల మతమునందు 'ఇ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్టములు కానందున నింద్యకర్మములుగాఁ బరిగణింపఁబడు చున్నవి.

కృష్ణార్జునుల ప్రితాపాగ్ని ఖాండవమును దహించినట్లే 'కృష్ణదేవరాయ బాహుప్రితాప జాగ్రన్మహాగ్ని' మన కళింగ దేశముపై దండెత్తినపు డేమిచేసెనో చూడుఁడు.

సీ. తొలు దొల్త నుదయాద్రి • శిలదాఁకి తీండ్రించు
నసిలోహమున వెచ్చ • నయిజనించె
మఱికొండవీడెక్కి • మారొక్కని నలియైన
యలకసవాపాత్రు • నంటిరాఁజె
అట సాఁగి జమ్మిలో • యఁబడి వేగి దహించెఁ
గోన బిట్టేర్చెగొ • ట్టానఁ దగిలె
కనకగిరిస్ఫూర్తిఁ • గరఁచె గౌతమిఁ గ్రాఁచె
నవ్వుల నాపొట్నూర • రవులకొనియె
గీ. మాడుగులవేల్చె నొడ్డాది • మసియొనర్చె
కటకపురిఁగాల్చె గజరాజు • కలఁగిపరవఁ
దోఁకచిచ్చననౌరయుద్ధురతఁ గృష్ణ
రాయబాహుప్రితాపజా • గ్రిన్మహాగ్ని.

పైపనులఁ గృష్ణదేవరాయలు చేసినట్లు అలసాని పెద్దన మహాకవి సాక్ష్య మిచ్చుటయేకాక (మనుచరిత్ర) శ్రీకృష్ణదేవ రాయచక్రివర్తియు నొప్పుదలమై (ఆముక్తమాల్యద) యు న్నాఁడు. ఇదియు 'ఇష్ట' కర్మమేనా ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శౌర్యప్రతాపాగ్ను లుండినపుడు శత్రుదేశదహనము తప్పుకాక యుత్తమకర్మమే యగును. కొన్ని శతాబ్దములకుఁ బూర్వమె సంపూర్ణముగ శౌర్యప్రతాపాగ్నులు చల్లారిన మన కిపు డట్టి దతిదారుణమును కఠినము నగు కర్మముగాఁ గాన్పించుట యుక్తమె, బలవత్ప్రతాపములుగల పాశ్చాత్యులు 'ఇటలీ జపానుల' కర్మములను నిందించుటలో భావభేదము కలదు.

ఖాండవదహనమున శరణాగతుఁ డగు మయునివలన నాతఁ డొక సరోవరతీరమున 'వృషపర్వుఁడు' అను నసుర రాజునకు సభను నిర్మించుటకై సేకరించి గుప్తపఱచిన యమూల్యమణికాంచన వస్తువితతి పాండవులకు లభించినది. ఆమణి కాంచనములు 'ఎనిమిదివేలమంది' (8000) బలవంతులగు రాక్షసులచే మోయించుకొని తేఁబడియుండెనఁట!

## మయశిల్పము.

'మయ' శబ్దము జాతివాచకముగాఁ గాన్పించును. మన గ్రంథములలో 'విశ్వకర్మ' దేవశిల్పి యని చెప్పఁబడినను, మన దేశమునందలి 'బంగరు పనివాండ్రు, వడ్రంగులు, కంచరులు' మొదలగువారిని 'విశ్వకర్మ' శబ్దముతోనె సంబోధించుట కలదు. అట్లే మయుఁడునని తలంపవలసి యున్నది.

'జందవేస్త' అను పారశీకుల వేదమున 'మజ్దవహు' అను నసుర శిల్పాచార్యుఁడును, అతనిగూర్చిన స్తోత్రములును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలవు. 'మజ్దనహు' శబ్దము 'మయశబ్దమునకుఁ బ్రకృతి యని కొందఱిమతము. శ్రీమద్రామాయణమున బహురత్నశోభిత మును, విచిత్రమును నగు 'స్వయంప్రభాగుహ' (1) మయనిర్మితమనియు, శ్రీరామునకును నభేద్యమై లక్ష్మణుని గాఢమూర్ఛలో ముంచిన రావణప్రయుక్తశక్తి రావణునకు మయునిచే నీయఁబడిన దనియు వర్ణింపఁ బడినవి. మహాభారత మయుఁడు విచిత్ర ధర్మజ సభానిర్మాతయై, భీమునకు భీమకర్మసాధనమగు గదను, అర్జునునకు దేవదత్తమను శంఖమును, నిచ్చియున్నాఁడు. భీముని గద, నేఁటికాలమునందలి పాశ్చాత్యుల 'లూయీ, హవిజర్' శతఘ్నులవంటిదిగా నెన్నఁదగి యున్నది.

మయజాతివారు మనదేశమునుండి 'అమెరికా' ఖండమునకు వలసవెళ్లిరను నైతిహ్యము కలదు. 'మెక్సికో' దేశమునందును, బ్రిటీషు హాండురాసు' నందును, మయశిల్పములను గత శతాబ్దమునఁ బాశ్చాత్య పరిశోధకులు కనుగొనిరి. మెక్సికోదేశమునందుగల మయశిల్పములను 'బిషపులాండా' అను స్పెయినుదేశీయుఁడు కూరత్వముతో నాశముఁజేసెను. యునైటెడ్ స్టేట్సులోని 'హార్వర్డు' యూనివర్సిటీయందలి పండితుఁడగు 'డాక్టర్ స్పెండన్' గారు 'బ్రిటిషు హాండురాసు' మండలము

---

(1) స్వయంప్రభాగుహ వింధ్యపర్వతప్రాంతమున నున్నదని రామాయణమునఁగలదు. అది 'ఎల్లోరా, అజంత' గుహలలో నొకటిగ నుండవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లోని 'లుబాండం' అను ప్రదేశమును దర్శించి యందలి కట్టడములఁ బరిశోధించిరి. అం దేఁబది యడుగుల యెత్తుగలిగి యెనిమిది యెకరముల ప్రదేశమున వ్యాపించి స్ఫటికపురాలతో నిర్మింపఁబడిన మహాసభ వారికిఁ గాన్పించి దిగ్భ్రమం గొల్పినదఁట! అది మయశిల్పమని వారు వ్రాసియున్నారు. దానివర్ణనములు ధర్మజు మయసభావర్ణనములఁ బోలియున్నవి. 'మెక్సికో, మధ్యయమెరికా, పెరూ' దేశములలోఁ దొలుత నొకకోటి నలువది లక్షలమంది మయజాతివారుండిరనియు, స్పెయిన్ దేశీయు లామయజాతిజులను గూరముగా సంహరించిరనియు, పాశ్చాత్యుల గ్రంథములవలననె తెలియనగుచున్నది. ఇప్పటికామయజాతిజులు హతశేషులై నలువది వేలమంది మాత్రమే కలరఁట! మనదేశమునందలివారు, 'ఆర్యానార్య ద్రావిడ'జాతివారలలో సంకరులై యుందురు.

మయుఁడు ధర్మజున కిచ్చిన సభావర్ణనము భారతపాఠకులకుఁ దెలియఁగలదు. (1)

ధర్మజుఁడు పార్థముఖమున ఖాండవవనము నగ్నికర్పించి 'ఇష్టము' అనుకర్మముఁ జేసియు అర్జునునివలననే చోరుల నణపించి బ్రాహ్మణుని గోవులఁ గాపాడుటచేతను, మయునిచే నపూర్వసభానిర్మాణముఁ జేయించుటచేతను, 'పూర్తము'అను

(1) ఇంకను మయసభావిశేషములను నాకృతమగు మహాభారతచరిత్రమునఁ జూడనగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కర్మమును జేసియు, రాజసూయమునకుఁ బ్రాక్కాలీనములగు 'ఇష్టాపూర్తములను' జేసినవాఁడయ్యెను. అందువలననే రాజసూయ యాగమును జేయుట కుద్యుక్తుఁడయ్యెనని తలంపవలసి యున్నది.

## జరాసంధవధము.

(1) జరాసంధుఁడు పాండవప్రపితామహియగు 'సత్యవతికి' సవతియన్నయగు 'బృహద్రథుని' పుత్రుఁడు. శ్రీకృష్ణుని మేనమామయగు 'కంసునకు' మామ. కాన, భీమునిచేఁ జంపఁబడునాఁటికి శతాధికవృద్ధుఁడై భీష్మునితో సమానవయస్సుకలవాఁడో యంతకంటెఁ బెద్దవాఁడో యై యుండెను. అతఁడు మొగలాయి చక్రవర్తులలో 'ఔరంగజీబు'వలె భరతఖండస్థరాజులపైఁ బెక్కులు దండయాత్రలు చేసి యందఱకు భయంకరుఁడుగాఁ బ్రవర్తింపుచుండెను. అందు శ్రీకృష్ణుఁడు తన యల్లుఁడగు కంసుని వధించుటచే స్వపుత్రికల ప్రోత్సాహమువలన శ్రీకృష్ణుపై మిగుల నలిగి యాతనిపైఁ బెక్కుదండయాత్రలను జేసెను. జరాసంధుని దండయాత్రలకు భీతినొంది శ్రీకృష్ణాది యాదవులు పదునెనిమిదివేలమంది మథురాపురిని విడిచి దానికిఁ గొన్నివందలక్రోశముల దూరమునం దుండిన పశ్చిమ సముద్రతీరమున ద్వారకాపురిని నిర్మించుకొని యట నివసించిరి. నాఁటి

(1) మహాభారతచరిత్రమున జరాసంధునిగూర్చి విశేషాంశములు వ్రాయఁబడెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలమున, ప్రాగ్భారతదేశమునందలి మహావీరులగు 'రుక్మి, శిశుపాల, పౌండ్రకవాసుదేవ, భగదత్తులును, కళింగాధీశుఁడు, కాశిరాజు' మొదలగువారును, జరాసంధునకు లోఁబడి యాత్రనిని సమ్రాట్టునుగా నంగీకరించిరి. ఆతని నెదిరించిన కొందఱిరాజుల నాతఁడు బంధించి వారిని బశువులనుగాఁ జేసి, పౌరుషసూచకమగు నేదియొ యొక యాగముఁ జేయదలఁచి యుండెను.

జరాసంధునియొక్క దీర్ఘకాల రాజ్యపాలనముచేతను, అంచాతని తెరపిలేని యుద్ధయాత్రిలచేతను, రాజవంశజులకును బ్రిజలకును విసుగు కలిగి యుండినట్లు కాన్పించును. అందువలననే జరాసంధ వధానంతర మాతనిదగు 'గిరివ్రజ' పురిలోనివారెవ్వరును విచారింపలేదు. ఆతనిపుత్రిఁడగు సహదేవుఁడును పాండవుల కిష్టుఁడై యయ్యెను. జరాసంధునిచేఁ జెరసాలలలో నుంపఁబడి శ్రీకృష్ణునిచే ముక్తి నొందినరాజులును, పాండవపక్షులైరి. కాని యెంతటివృద్ధైనను, ఎంతగా నన్యులగు రాజులకును, స్వరాజ్యమునందలి జనులకును నహితుఁడైనను, పరిపాలనానై పుణ్యముచేతను, అభేద్యములగు సైన్యములు కలవాఁడగుటచేతనుఁ జరాసంధుని శ్రీకృష్ణుఁడు, భీమార్జునులుగూడఁ బ్రత్యక్షముగ మార్కొని జయింపనేరక మారువేసములతో, పెడదారుల నాతని గృహముఁ బ్రవేశించి, యర్ధరాత్రిమునఁ జంపిరి. ఇందు స్వదేశస్థుల రహస్యపు తోడ్పాటుకూడ నుండిన నుండును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జరాసంధుఁడు వ్యూహనిర్మాణములచేఁ బరసైన్యముల నోడింప సమర్థుఁడైనను శతాధికవృద్ధుఁ డగుటచేతను, ఇంతకుఁ బూర్వమె కొన్నియేండ్లనాఁడు 'రాజపురి'లోఁ గర్ణునితోనైన ద్వంద్వయుద్ధములో నెముక విరిగినవాఁడగుటచేతను (1) యువకుఁడు, మల్లయుద్ధ విశారదుఁడు, నగు భీమునిచేఁ జచ్చుట యొక విశేషములోనిది కాదు. అందువలననే కృష్ణద్వైపాయన విరచితమగు 'జయము' అను నితిహాసమున నీయంశము చెప్పఁ బడలేదేమొ! వైశంపాయనుఁడు నిజచరిత్రాంశమునె జనమేజయునకుఁ జెప్పిన భారతమనుదానిలోఁ జేర్చియుండును.

## భీమార్జున నకుల సహదేవుల దిగ్విజయము.

ఇది సభాపర్వమునం దస్థానమునఁ జెప్పఁబడెను. ఐతరేయబ్రాహ్మణాది వైదికగ్రంథములలో రాజసూయమునకుఁ బూర్వము (అశ్వమేధమునకువలె) దిగ్విజయము చేయవలయునని యెచ్చటను జెప్పఁబడలేదు. రాజసూయమున భవిష్యద్దిగ్విజయముఁ గోరుచు నందు శత్రుకృతానర్థములు రాకుండుటకు, రాజును, అధ్వర్యుఁడు నొనర్చు హోమాదులు కలవు. యుక్తముగ రాజసూయమున ఋత్విక్కులు కర్మములఁ జేయించిన రాజునకు భవిష్యత్తునందు విజయములు కలుగుననియు, అట్లు తనకుఁ గలిగినవనియు జనమేజయుఁడు చెప్పిన శైలైతరేయ

(1) ఈయంశము శాంతిపర్వమునఁ గర్ణచరిత్రమునఁ జెప్పఁబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రాహ్మణమునఁ గలరు. ఆయంశ మింతకుఁ బూర్వమె వ్రా యఁబడెను. నారదుఁడు రాజసూయముఁ జేయుమని ధర్మజు నకుఁ జెప్పుటలోఁగూడ—

"అదియును నిర్విఘ్నంబుగ సమాప్తంబయ్యెనేని నిఖిల ప్రజాప్రళయకారణంబైన రణం బగును"

అని చెప్పియున్నాఁడు. అంతియె కాని, తొలుత దిగ్విజ యము కావలెనని యెచ్చటను లేదు. రాజసూయము భవిష్య ద్దిగ్విజయమునకుఁ బూర్వమున నొనర్పఁ దగిన యజ్ఞమె. అం దులకు మనుష్య (క్షత్రియ) పశువిశసనమె దృష్టాంతము. ఈ యజ్ఞమొనర్చినరాజు తమతమ దేశములపైఁ బడునను భయ ముచేతను, అన్యోత్కర్షాసహిష్ణుత చేతను, పరరాజులు యజ్ఞ మునకు విఘ్నము గలుగఁ బ్రవర్తింపుచుందురు. ధర్మజుని విష యమున దుర్యోధనున కట్టి యీర్ష్యయే కలిగినది. కాని, రాజ సూయమును నిర్వర్తించుటకుఁ దగిన ధనమును, అధికారమును దొలుత సంపాదింప వలసియున్నది. విఘ్న మొనరించువారి నణఁచి యుంచవలెను. ఆట్టిపరిస్థితులు ధర్మజునకుఁ గలిగినవి. ఖాండవ వనదహనముచే నందలి యమూల్యమణికాంచనాదులు లభించినవి. అధికారము కూడ వృద్ధియైనది. ఇష్టాపూర్త సిద్ధి యైనది. ప్రబలుఁడగు జరాసంధుఁడు చచ్చుటచేఁ బ్రబల విఘ్న కరులు లేరు. ఇఁక ధర్మజునకు రాజసూయముఁ జేయుట కే యభ్యంతరములు గలవు? ద్విగ్విజయ మెందులకు?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సభాపర్వమునందలి దిగ్విజయాంశములు భూగోళశాస్త్రసభిజ్ఞునిచే నందిరికింపఁబడినవి. ఇందులకుఁ గొన్ని నిదర్శనములఁ జూపెదను. అర్జునున కుత్తరదిగ్విజయయాత్రలో (1) త్రిగర్త (2) సుహ్మ (3) చోళ (4) బాహ్లిక దేశములు తగిలినవి. ఇవి కురుదేశమున కుత్తరముననుండు దేశములు కావు.

(1) త్రిగర్తము కురురాజ్యమునకు దక్షిణపశ్చిమభాగముననుండునది (2) సుహ్మము గంగానది నంటి కురుదేశమునకుఁ బ్రాగ్భాగమున నుండునది. (3) చోళదేశము, దక్షిణభారతముననుండు దేశము.

ఇట్లే భీముని ప్రాగ్దిగ్విజయ యాత్రలో, కురుదేశమునకు దక్షిణమునఁగల 'దశార్ణ'దేశమును కృష్ణానదీపరిసరముననుండిన (1) 'మల్లక'దేశమును వర్ణింపఁబడినవి.

సహదేవుని దక్షిణదిగ్విజయమున 'నర్మదానదీ'తీరమున 'భగదత్తుఁడు' అర్జునునిచే నోడింపఁబడి, కరము నిచ్చినట్లు విని, సహదేవుఁడు భగదత్తునితో యుద్ధముఁజేయక వెడలిపోయెనఁట! హిమాలయమునంటి భరతఖండమున కీశాన్యమున నుండిన ప్రా

---

(1) 'మల్లక'దేశము 'ములక'నామకదేశమై తుదకు ములికినాఁడై నది. ములికినాఁడు 'కడప, కర్నూలు'మండలములలోను, నిజామురాజ్యాంధ్రమండలమునఁ గొంతవఱకును వ్యాపించినట్లు శాసననిదర్శనము లున్నవి. పైప్రదేశములలో ములికినాఁటి బ్రాహ్మణులు నేఁడును విస్తారముగాఁ గలరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్జ్యోతిష మెక్కడ? నర్మదానదీసమీపమునందలి సహదేవుని దక్షిణమార్గమునం దదితగులుట యెక్కడ?

నకులుని పశ్చిమదిగ్విజయయాత్రియందును, అర్జునుని తో నుత్తరదిక్కున యుద్ధము నొనర్చిన త్రిగర్తము, (1) ఉత్స వసంకేతనగణము, భీమునిచేఁ దూర్పుదిక్కున జయింపఁబడిన దశార్ణదేశము కాన్పించినవి.

పైయసందర్భములఁ జూచినచో మహాభారతమున నిటీవల భీమార్జున నకుల సహదేవుల దిగ్విజయము లెవరిచేతనో చేర్పఁబడినవిగాని, మొదటిభారతములోనివిగాఁ గాన్పింపవు. కాని, భీమాదులు, ఇంద్రప్రస్థరాజ్యము నొందినపిమ్మట ఖాండవవనదహనమునకుం బూర్వమున నె కొన్నియుద్ధములను భీష్మ ధృతరాష్ట్రుల యనుమతితో నొనర్చినట్లు కలదు. చూడుఁడు.

(2) ఆపాండవు లింద్రప్రస్థమున నివసించుచున్నవారై రాజైన ధృతరాష్ట్రునియొక్కయు, భీష్మునియొక్కయు శాసనము ననుసరించి శత్రురాజులను జయించిరి.

---

(1) ఉత్సవసంకేతగణము హిమాలయమున కుత్తరమున నుండెనని కాళిదాస మహాకవి రఘువంశమున (4-78) వర్ణించియున్నాఁడు. సుహ్మ దేశము వంగదేశమునకుఁ బశ్చిమభాగమునందుండినట్లును (4-35) వర్ణించియున్నాఁడు.

(2) శ్లో॥ ఇంద్రప్రస్థే వసంతస్తే జఘ్నురన్యాన్ నరాధిపాన్।
శాసనా ద్ధృతరాష్ట్రస్య రాజ్ఞః శాంతనవస్యచ॥
ఆదిపర్వ. 222 అధ్యా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈయంశము పాండవులకు రాజ్యమునందుఁ బూర్ణమగు నధికారము లేదనియు, ధృతరాష్ట్రునకు లోఁబడి యుమ్మడిగ రాజ్యము నేలుచుండినవారై యనియు స్పష్టపఱచుచున్నది. ఆయంశమును వ్రాయుటకుఁ బూర్వమునాఁటి భరతఖండస్థరాజ్యములఁగూర్చి స్వల్పముగాఁ బ్రస్తావింతును.

భారతకాలమున భరతఖండము, రష్యాకాక తక్కిన నేఁటి యూరపుఖండమంత ప్రదేశము కలదైనను, నేఁడు యూరపుఖండమందలి రాజ్యవిభాగములకంటె నాలుగైదురెట్లు హెచ్చుగురాజ్యవిభాగములు కలిగియున్నది. అందుఁ గొన్ని స్వల్ప ప్రదేశవ్యాప్తములై 'బెల్జియము, హాలండు, డెన్మార్కుల' వలె రాజన్వంతములు. మఱికొన్ని 'స్విడ్జర్లండు, లిథూనియా, ఫిన్లండు'లవలె విరాజములును, అధినాయకములును. మఱికొన్ని ఆయుధజీవికగణపాలికములు. (1) మఱికొన్ని బలవంతములు, రాజన్యపాలితములునై ప్రసిద్ధి నడసిన 'ఇంగ్లాండు, ఇటలీల' వంటివి, ఇట్లే నాఁటిభరతఖండస్థరాజ్యములు పలువిధములుగాఁ బాలింపఁబడినట్లు కాన్పించును. భారతమునఁ బ్రసిద్ధి నొందిన 'కురు, పాంచాల, మగధాది'దేశములు కడపటితరగతిలోని 'ఇంగ్లాండు, ఇటలీల' వంటివి. భారతకాలమునాఁటి దేశవ్యవ

(1) భరతఖండమునందలి పశ్చిమోత్తరపరగణాల సరిహద్దులోని 'జక్కాఖేలు, అఫ్రిడీలు, మొహమండులు' మొదలగువారు నేఁటికిని ఆయుధజీవికగణములలోనివారె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థలఁ గూర్చిన సాధారణాంశములు గల పట మిందుఁ జూపుచున్నాను.

త్రిగర్త లాఱుతెగలవారనియు, ఆతెగిలాయుధజీవికగణములనియుఁ బ్రసిద్ధికెక్కిన 'పాణిన్యాచార్యులవారు' అష్టాధ్యాయియందు వ్రాసియున్నారు. (1)

త్రిగర్తలతో సంబంధించిన 'దామన్యాది'గణములలోనివారె మనయాంధ్రదేశము నేలిన 'కాకతీయులు' ఇందును గూర్చి నామహాభారతచరిత్రమున వివరించియున్నాను.

భీమార్జున నకుల సహదేవులు తమరాజ్యపుసరిహద్దులందుండిన పైయాయుధజీవిక గణములనె జయించియున్నారు. ఈ యంశమును ధర్మజుఁడు రాయబారమునకు వచ్చిన సంజయునితో నిట్లు వెల్లడించియున్నాఁడు.

(2) కురుదేశీయులు, కూడుకొనిన చోరసంఘములం

---

(1) సూ. దామన్యాది త్రిగర్తషష్ఠాచ్ఛః॥ 5-3-116.

(2) శ్లో॥ కచ్చిద్రాజానం ధృతరాష్ట్రం సపుత్రం సమేత్యాహుః కురవస్సర్వఏవ। కచ్చిద్దృష్ట్వా దస్యుసంఘాన్ సమేతాన్ స్మరంతిపార్థస్య యుధాం ప్రణేతుః। గదా పాణి ర్భీమసేన స్తరస్వీ ప్రవేపయన్ శత్రుసంఘా ననీకే నాగః ప్రభిన్న ఇవ నడ్వలేషు చంక్రమ్యతే కచ్చిదేనం స్మరంతి? మాద్రీపుత్ర స్సహదేవః కళింగాన్ సమాగతానజయ ద్దంతకూరే। వామేనాస్యన్ దక్షిణేనైవ యోవై మహాబలం కచ్చిదేనం స్మరంతి? పురాజేతుం నకులః ప్రేషితో యం శిబింస్త్రిగర్తాన్ సంజయ పశ్యతస్తే। దిశం ప్రతీచీం వశమానయన్వై మాద్రీసుతం కచ్చిదేనం స్మరంతి? ఉద్యోగరపర్వ. అధ్యా 23.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూచినపుడు సపుత్రుఁ డగు ధృతరాష్ట్రుం జేరి యుద్ధవీరుఁడగు నర్జునుని స్మరించుచున్నారా ?

చుఱుకుఁదనము గలిగి గదాపాణియై 'కిక్కిరిసపుగడ్డి' గల బీటిపై విడివడిన యేనుఁగువలె విజృంభించి శత్రుసంఘము లను బీడించు భీముని స్మరించుచుందురా ?

'దంతపూరము' అనుస్థలమునఁ గూడికొనిన కళింగసంఘ ములను సహదేవుఁడు జయించెను. ఆయంశమును స్మరించుచుం దురా?

పూర్వము నకులుఁడు 'శిబిని, త్రిగర్తలను' జయించుట కుఁబంపఁబడఁగా, సంజయా! నీవు చూచుచుండఁగనే నకులుఁడు వారిని జయించి పశ్చిమదిక్కును వశపఱచుకొన్నాఁడు. ఆయంశ మును (మీవారు) స్మరించుదురా?"

భీమాదులచేజయింపఁబడినపై వారిలో నొక్క 'శిబి'తప్ప తక్కినవారు 'చోరసంఘములు' ఆయుధజీవికగణములే, యై యున్నవి. 'శిబి' అనామతరువగునొకరాజు, అందువలననే పాం డవులలోఁ దక్కువ బలవంతుఁడగు నకులునిచే జయింపఁ బడియు న్నాఁడు. ఈజయములే ఇంద్రప్రస్థరాజ్యము నొందిన తరువాతను ఖాండవవనదహన రాజసూయములకుఁ బూర్వముననుఁ బాండవు లొనర్చిన నిజమగు దిగ్విజయములు.

ఖాండవవనదహనమునకుఁ బూర్వముననే పాండవులు దిగ్విజయమొనర్చినట్లు 'జయము' యొక్క అనుక్రమణికలోఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జెప్పఁబడియుండెను. అర్జునుఁడు చోరసంఘముల జయించుట సాధారణాంశముకాదు. ఆతఁడు కట్టకడపటిదశలోఁగూడ, కిరాతులనఁబడుచోర సంఘములతోనె పోరాడి శ్రీకృష్ణుభార్యలను యాదవుల యపారధనమునుగోల్పోవ వలసివచ్చినది. కాన నాఁటి చోరసంఘము లపారబలవత్తరము లనఁదగి యున్నవి. కురుక్షేత్ర సంగ్రామమునఁ గూడ ఆయుధ జీవికులగుత్రిగర్త గణములతోనె యాతఁడు పోరియున్నాఁడు. ఆతనికృత్యములలో ఖాండవదహన కార్యమె గొప్పదిగా 'జయ, భారత, మహాభారత' భాగములలో ననేకస్థలములలోఁ జెప్పఁబడియున్నది. "స సర్వాన్ పార్థివాన్ జిత్వాగణా నేకైకశోబలీ" అనుభారతానుక్రమణికలోఁ జెప్పఁబడిన యంశముకూడ నర్జునుఁ డనేకగణములను (ఆయుధజీవికగణములను) జయించినట్లు సుస్పష్టము చేయుచున్నది.

పై కారణములచే నన్నివిధములజరాసంధవధానంతరము వర్ణింపఁబడిన దిగ్విజయవర్ణనము 'అప్రాప్త' మగుచున్నది.

## రాజసూయగాథ

ఇది భవిష్యత్తునందు సమ్రాట్టగుటకు సూచకముగాఁ జేయఁబడునదియే కాని సమ్రాట్టయినపిమ్మట నొనర్పఁబడునది కాదని యింతకుఁ బూర్వమె వ్రాసియున్నాను.

సమ్రాట్టయి 'మహాభిషేకము' నొందినపిమ్మట అశ్వమేధము నొనర్పవలయును, ధర్మజుఁడు కురుక్షేత్రయుద్ధానంతర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము సమ్రాట్టగుటచే (1)మహాభిషేకమునొంది పిమ్మట నశ్వమేధము నొనర్చియున్నాఁడు. హరిశ్చంద్రుని రాజసూయము కంటె ధర్మజుని రాజసూయము సాంగోపాంగమై సంపూర్ణత నొందినట్లు మహాభారతమునందలి వర్ణనములవలనఁ దెలియుచున్నది. ఇందులకు ముఖ్యమైనకొన్నియంశములఁ జూపెదను.

(1) ఋత్విక్కులు సమర్థులు కావలెను. కృష్ణద్వైపాయనాదులు హరిశ్చంద్రుని యాగమునందలి ఋత్విక్కులతో సములై సమర్థులై నవారె, కాని హరిశ్చంద్రునియాగముకంటె నిందు భీమార్జునాదివీరులు సంపాదించితెచ్చిన యపారధనము విస్తారముగా దక్షిణాదికమునకై వినియోగింపఁబడి యుండుటయు, అన్నదానాదికము విశేషముగా జేయఁబడుటయుఁగలిగియుండుటయతిశయము. హరిశ్చంద్రుని రాజసూయమునం దటివిశేషవర్ణనములు కాన్పింపవు.

(2) అన్నిటికంటె ముఖ్యాంగమైనది (క్షత్రియ)పశువిశసనము.

హరిశ్చంద్రుని రాజసూయమునఁ దొలుతఁ బశువుగా నిర్ణయింపఁబడిన క్షత్రియుఁడగు 'రోహితుఁడు' తప్పించుకొనెను. వానికిమారుగా నిర్ణయింపఁబడిన శునశ్శేపుఁడైనను విశసింపఁబ

---

(1) శాంతిపర్వమున ధర్మజుఁడు పట్టాభిషిక్తుఁడైన ఘట్టమునందలి వర్ణనములు 'ఐతరేయబ్రాహ్మణము' నందలి మహాభిషేక విధులకు సరిపోయి యున్నవి. కాన నది ధర్మజుఁడొందిన మహాభిషేకమె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డక తప్పించుకొన నట్లా విశ్వామిత్రాదు లారాజసూయముం బూర్తి చేసిరి. ధర్మజుని రాజసూయమున ధర్మజునియుక్తి చే విధి యందున్న రీతిని యువకుఁడును యుద్ధసన్నాహశీలియుఁ నగు 'శిశుపాలుఁడు' అంతర్వేదికిఁ దేఁబడి హఠాత్తుగ శ్రీకృష్ణుని చక్రముచేఁ గొట్టఁబడుటచే 'విధ్యుక్తమగు' క్షత్రియపశువిశస నమె ధర్మజుని రాజసూయమునందు జరిగియున్నది. అన్నిటికంటె నిది రాజసూయమునకు ముఖ్యాంశము. ఆయంశముఁ జర్చించు టకుఁ బూర్వము "శిశుపాలుని' చరిత్రము క్లుప్తముగాఁ జెప్ప వలసి యున్నది.

## శిశుపాలుఁడు

శిశుపాలుఁడు 'చేది' దేశాధిపతి. చేదిదేశము నేఁటి మధ్యరాష్ట్రములయందలి 'బిలాసపూరు, జెబ్బల్పూరు' మండలములలోఁ గొంతవఱకు వ్యాపించిన మితపరిదేశము. శిశుపాలుని తండ్రి దమఘోషుఁడు. తల్లి సాత్వతి. ఆమె కుంతీదేవికిఁ జెలియలు. అనఁగా శిశుపాలుఁడు పాండవులకుఁ బినతల్లి కుమారుఁడు. శ్రీకృష్ణునికి మేనత్తకొడుకు. శ్రీకృష్ణునికంటెఁ జాల చిన్నవాఁడు. చిన్నతనమున శిశుపాలుని శ్రీకృష్ణుఁ డెత్తికొనుచుండినట్లు భారతమునఁ గలదు. 'శిశుపాలుఁడు' స్వల్పమగు రాజ్యమున కధిపతి యనియు, బాలుఁడనియు, తెలివితక్కువ వాఁడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియు, ధర్మజునితో భీష్ముఁడు చెప్పిన క్రింది యంశములవలనఁ దెలియ నగుచున్నది.

ఉ. పాలితదుర్నయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీనినేల భూ
పాలక నీకుఁ బట్టునఁజుపన్ మఱి ధర్మ వెఱుంగ వీనికిం
బోలునె రాగకోప పరిభూత మనస్కున కల్పరాజ్యల
క్ష్మీ లలనాంధబుద్ధి కనిమిత్త మహా త్పరివాదశీలికిన్॥

రాజసూయ కాలమున కాతనికి 'ధృష్టకేతువు, శరభుఁడు' అను నిరువురు పుత్రులు గలరు. విదర్భాధిపతియగు 'భీష్మకుఁడు' శిశుపాలునకుఁ దనకూఁతురగు 'రుక్మిణి' నీయఁ దలంపఁగా శ్రీకృష్ణుఁడు రాక్షసవివాహ విధిచే రుక్మిణి నపహరించి పెండ్లియాడెను. (1) ఈ యీర్ష్యను మనస్సునం దుంచుకొని శిశుపాలుఁడు

(1) శ్రీకృష్ణాదులు ప్రాగ్జ్యోతిషముపైకి దండయాత్రకుఁ బోఁగా ద్వారకాపురిని గాల్చెను.

(2) ఉగ్రసేనుఁడు రైవతకాద్రియందు స్త్రీలతో విహరింపఁబోఁగా వారలను బాధించెను.

---

(1) మేనత్తకుమారునకు వాగ్దత్తయైన రుక్మిణిని శ్రీకృష్ణుఁడు పెండ్లియాడుట 'ధర్మవ్యతిరిక్తసాహసకార్యమని' తంత్రవార్తిక మహాభాష్యమున 'కుమారిలభట్టాచార్యుఁడు' వ్రాసియున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

I (3) వసుదేవుఁ డశ్వమేధముఁ జేయ నశ్వమును విడువఁగా దాని నపహరించి యాగమునకు విఘ్నముఁ జేసెను.

(4) 'బభ్రుపు' అను యాదవునిభార్య ద్వారకనుండి 'సౌవీర' దేశమునకుఁ బోయినపు డామెను కామమోహితుఁడై యపహరించెను.

II (5) వసుదేవుఁడు వరించినదియు, విశాలుఁడు అనువాని కుమార్తెయు నగు 'భద్ర' అనునామెను పొంచి పట్టుకొని యామెబంధువులగు 'కుకురులు, అంధకులు' అనువారిం జంపి, యా 'భద్ర'ను గొనిపోయి 'కరూశ' దేశపు రాజునకు నిచ్చెను.

పై యపకారములఁ దమకొనరించినట్లు శ్రీకృష్ణుఁడెవానిఁ జంపుటకుఁ బూర్వము సభలోఁ జెప్పియున్నాఁడు.

శిశుపాలుఁ డొనర్చిన పైకార్యములు 'అశక్తత, దుర్జ

---

I వసుదేవుఁ డేదేశమునకును రాజుకాఁడు. అట్టివానికి నశ్వమేధము నొనర్ప నర్హత యెట్లుకలిగినది? సార్వభౌముఁడె యశ్వమేధము నొనర్పవలయునని 'తైత్తిరీయబ్రాహ్మణము' విధించుచున్నది. ఎట్లో కలదనినను అశ్వసంరక్షణమునకై బలవంతులగు శ్రీకృష్ణాది పుత్రులు గాని, ప్రద్యుమ్నాది పౌత్రులుగాని యేల యశ్వసంరక్షణమున కేఁగ లేదు? కాన వసుదేవుని యశ్వమేధయాగ గాథ మృషయనియే చెప్పవలసియున్నది—

II ఈయంశము కొన్ని సంస్కృత భారతపు ప్రతులలో లేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నత్వములతోఁ జేయఁబడినవియె కాని వీరకృత్యములు కావు.

కాని, 'భాగవతాది' పురాణములలోను, 'శిశుపాలవధాది' కావ్యములలోను, 'సనకాది మహర్షుల'చే శప్తులైన విష్ణుద్వారపాలకులగు 'జయ, విజయులు' తొలిజన్మమున 'హిరణ్యాక్ష, హిరణ్యకశిపులును, రెండవజన్మమున 'రావణ, కుంభకర్ణులు'ను నైరనియు, మూఁడవజన్మమున 'శిశుపాల, దంతవక్త్రు' లైరనియుఁ జెప్పఁబడియున్నది.

లోకోపద్రవకర కార్యములను 'హిరణ్యకశిపు, రావణా' దు లొనర్చినట్లు శిశుపాల దంతవక్త్రు లే దుష్కార్యములఁ జేసిరి? శిశుపాలుఁడైనను దనకుఁ బగవారగు యాదవులకె యపకృతిఁ జేసెను గాని యితరుల కేవిధమైన యపకారములను జేయలేదు. కరూశ దేశాధిపతియగు 'దంతవక్త్రుఁడు' శ్రీకృష్ణునకుఁ గూడ నేవిధమగు నపకృతియుఁ జేసినటులు లేదు. అట్టివారు రావణాదుల యవతారులనుట యెట్టిది? హిరణ్యకశిపు రావణు లెక్కడ? శిశుపాలుఁ డెక్కడ? శిశుపాలుఁ డేవిధముగను రావణాదుల కీడుగాఁడు. రావణాదుల యపరావతారుఁడును గాఁడు. ఇది మిథ్యాకల్పనమె యనవలసియున్నది.

పెద్దతల్లి కుమారుఁడు చేయు రాజసూయముఁ జూడ వచ్చిన శిశుపాలుని భీష్మ శ్రీకృష్ణుల ప్రోత్సాహముచే ధర్మజుఁడు 'ఉదనసానీయేష్టి' యందుఁ బశువుగాఁ జేయ నియ్యకొని యుండును. ఇది శ్రీకృష్ణునకు శత్రునిశ్శేష హేతువును, భీష్మున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుఁ దనమనుమని రాజసూయము విధ్యుక్తధర్మముగా జరిగి యుండుటచేఁ దృప్తి హేతువును నైనది. ధర్మజునకును నట్టిదియే.

అందువలన 'పునరభిషేచన' దినమున (1) 'అంతర్వేది' యం దందఱును జేరినపుడు భీష్ముఁడు పూజ్యుఁడగు నెవనికైన 'అర్ఘ్యము' నీయ ధర్మజుఁ బ్రోత్సహించి, పిమ్మట (ఉదవసానీయేష్టికిఁ బూర్వమున) శ్రీకృష్ణుని యౌన్నత్యము నెంతమాత్రము సహింపని శిశుపాలునకుఁ గోపము రేఁగునట్లు అర్ఘ్యము నీయఁ బ్రోత్సహించిన తానె శ్రీకృష్ణుని మిగులఁ బొగడి, యాతనికె యర్ఘ్యము నీయుమని చెప్పగాఁ గోపోద్రిక్తుఁడగు శిశుపాలుఁడు శ్రీకృష్ణ భీష్ములను నిందింపుచు సభనుండి వెడలిపోవుచుండఁగా ధర్మరాజు శిశుపాలుని వెంబడించి వానిని అనునయింపుమాటలతో సభకుఁ దిరిగి తెచ్చెను.

సభకు రాఁగానె తిరిగి భీష్ముఁడు సులభకోపుఁడగు శిశుపాలునకుఁ గ్రోధాతిరేకము కలుగఁ బలుకఁగా శిశుపాలుఁడును నెనుదీయక భీష్మ శ్రీకృష్ణులను దూషింపుచుండఁగ నంతకుముం దేమియు ననని శ్రీకృష్ణుఁడును దాను శిశుపాలుని తప్పుల నె

(1) రాజసూయాంగమగు సోమయాగమైన మఱునాఁడు క్షత్రియవను విలసనముతోఁ గూడిన 'ఉదవసానీయేష్టి'తో సోమయాగము పూర్తి యగుననియుఁ బిమ్మట 'పునరభిషేచనము' అనుకర్మము జరుగుననియు నింతకుఁ బూర్వమె వ్రాసిన యంశములను నిట జ్ఞాపకమునం దుంచుకొనవలయును. శిశుపాలవధము పునరభిషేకమునకుఁ బూర్వమె యైనట్లు భారతమునఁ గలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్ణుచేఁ దటాలునఁ జక్రాయుధముఁ బ్రయోగించి శిశుపాలుని బడఁగొట్టెను.

శిశుపాలుఁడు తన్నట్లు కపటముగాఁ గొట్టుదురని యెఱుగఁడు. శ్రీకృష్ణునిచేఁ దన్నట్లు చేయింతురని యెఱిఁగియుండినఁ దిరిగి సభకు రాకుండఁగనైన నుండును; లేక యుద్ధమునైనఁ జేసి యుండును. ఇది యజ్ఞవేదికయందు జరిగిన దగుటచే క్షత్రియపశువిశసనమె యైనది.

ఇంతమాత్రమె కాదు. జరాసంధుని భీముఁడు వధింపఁగా జరాసంధుని దేహమునకు నాతని పుత్రుఁడగు సహదేవుఁ డంత్యక్రియలఁ జేయ శ్రీకృష్ణుఁ డనుజ్ఞ నిచ్చెను. కాని, శిశుపాలుని దేహమును వేగముగా సంస్కరింపుఁడని ధర్మజుఁడు దగ్గఱనుండిన పుత్రుని నియోగింపక తన తమ్ములను నియోగించిన ట్లున్నది.

మఱియు శిశుపాలుని పుత్రుఁడు సన్నిధి నుండుటచేతనే ధర్మజుఁడు, అప్పుడె శిశుపాలపుత్రుఁ జేదిదేశమునకుఁ బట్టాభిషిక్తుం జేసెను. శిశుపాలుని వేగముగా సంస్కరింపుఁ డనుట లో 'ఇష్టిక్రియ' కాలస్యము లేకుండఁగఁ జేయుటకై యుండును.

పై యంశము లెట్లుండెనో మూలము ననుసరించి వ్రాయుచున్నాను. (శ్రీకృష్ణుఁడు శిశుపాలునిపై నేరములఁ జెప్పుచు)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(1) "ఓ రాజులారా! మీరు చూచుచుండఁగ నిప్పుడె వీనిఁ బడఁగొట్టెదను. అని చెప్పి తత్ క్షణమె శత్రుభయంకరుఁడగు కృష్ణుఁడు చక్రముచే శిశుపాలుని శిరమును గొట్టెను. ఆ శిశుపాలుఁడు వజ్రాహతమగు పర్వతమువలెఁ బడెను..... అందఱును సంతోషింపుచు శ్రీకృష్ణుని విక్రమమును బ్రశంసించిరి.

అపుడు ధర్మజుఁడు తమ్ములతో వేగముగా శిశుపాలుని సత్కారముతో సంస్కరింపుఁడు అనెను. ధర్మజుని శాసనము ననుసరించి యాతని తమ్ము లట్లేచేసిరి. అప్పుడె చేదిదేశమున కాతని పుత్రుని 'పార్థుఁడు' రాజులతోఁ గూడి పట్టాభిషిక్తుం

(1) శ్లో॥ అధునా వధయిష్యామి పశ్యంతాం వో మహీక్షితాం। ఏవముక్త్వా యదుశ్రేష్ఠ శ్చేదిరాజస్య తత్ క్షణాత్। వ్యపాహర చ్ఛిరః క్రుద్ధ శ్చక్రేణా మిత్ర కర్షణః। సపపాత మహాబాహు ర్వజ్రాహత ఇవాచలః॥......................................

శశంసు ర్నిర్వృతా స్సర్వే దృష్ట్వా కృష్ణస్య విక్రమం। పాండవ స్త్వబ్రవీ ద్భ్రాతౄన్ సత్కారేణ మహీపతిం॥ దమఘోషాత్మజం వీరం సంస్కారయత మాచిరం। తథాచ కృతవంతస్తే భ్రాతుర్వై శాసనం తదా॥ చేదీనా మాధిపత్యేచ పుత్రమస్య మహీపతేః। అభ్యషించ త్తదా పార్థ స్సహతై ర్వసుధాధిపైః॥
తత స్సకురురాజస్య క్రతు స్సర్వసమృద్ధిమాన్।
యూనాం ప్రీతికరో రాజన్ సంబభౌ విపులౌజసః॥

సభాపర్వ॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేసెను. పిమ్మట పరితాపవంతుఁడగు ధర్మజునియొక్క రాజసూయము సమృద్ధిమంతమై యునకులకుఁ బ్రీతికరమై ప్రకాశించెను."

(క్రింద గీఁతలుగల యంశములఁ బరిశీలించినయెడల పుత్రుఁడు సన్నిధి నుండినను శిశుపాలుఁడు వానిచే సంస్కరింపఁబడక ధర్మజుని సోదరులచే యజ్ఞయపశువుగా సంస్కరింపఁబడినట్లు స్పష్టమగుచున్నది. మఱియు శిశుపాలుని సంస్కరించుటచేతనె రాజసూయము బాగుగ నయ్యెను. అనికూడఁ జెప్పఁబడెను.)

శిశుపాలుఁడు యుద్ధముచేసి మృతి నొందెనని కొన్నిభారతపు ప్రతులలోను, శిశుపాల వధాది కావ్యములలోను గలదుకాని, యుద్ధభూమిలో లేక సభలోనె నమ్మికతో నుండినపుడే ప్రమాదమునొంది శ్రీకృష్ణునిచేఁ గొట్టఁబడెనని 'సాల్వని' యీక్రింది వాక్యములు స్పష్టపఱచుచున్నవి.

(1) "నే నిపుడా పాపకర్ముఁడు, క్షుద్రుఁడు, విశ్వాసఘాతకుఁడు, నగుకృష్ణుని శిశుపాలుని జంపెనను కోపమువలన యమ సన్నిధి కంపెదను.

---

(1) శ్లో॥ అద్య తం పాపకర్మాణం క్షుద్రం విశ్వాస ఘాతినం।
శిశుపాల వధామర్షా ద్గమయిష్యే యమక్షయం॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(1) "నాకు సోదరుఁడు రాజు నగు శిశుపాలుఁడు పాప స్వభావుఁడగు నెవనిచేఁ జంపఁబడెనో వాని నీభూమిపైఁ జంపఁ గలను.

బాలుఁడు, రాజు, ధీరుఁడు, నగు నాసోదరుఁడు ప్రమాదమునొంది యుద్ధముఖమున లేనపు డెవనిచేఁ జంపఁబడెనో వానిని జంపుదును"

సాల్వుఁ డిట్లనె నని కృష్ణుఁడే వనమునందుండిన ధర్మజుఁ జూడ నేఁగినపుడు చెప్పెను.

పైయంశములచే శిశుపాలుఁడు తన్నట్లు చేయుదురని తలంపక పరాకుగా నుండినపుడె తటాలున శ్రీకృష్ణుఁడు చక్రముచే శిశుపాలుఁ గొట్టియున్నాఁడనుట స్పష్టమగుచున్నది. ఇంతమాత్రమె కాదు. కృష్ణపాండవు లపుడు మహౌద్ధత్యదశలో నుండుటచే సభలోనివా రెవ్వరును నేమియుఁ జేయనేరక కృష్ణునే నుంతించియున్నారని, దుర్యోధనుఁడు శకునితోఁ జెప్పిన యీక్రింది వాక్యముల వలనఁ దెలియనగుచున్నది.

ఉ. "యాదవుచేతి చక్రము భయంకరమై శిశుపాలమస్తకచ్ఛేదము నేసినం గడుఁ బ్రసిద్ధులు శూరులు నైనరాజుల

---

(1) శ్లో॥ మమ పాపస్వభావేన భ్రాతా యేన నిపాతితః।
శిశుపాలో మహీపాల స్తం వధిష్యే మహీతలే॥
భ్రాతా బాలశ్చ రాజాచ నచ సంగ్రామ మూర్ధని।
ప్రమత్తశ్చ హతో వీర స్తం హనిష్యే జనార్దనం॥
అరణ్యపర్వ॥ 14 అధ్యా॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

య్యాదవు ముందటన్ జయజయధ్వను లిచ్చిరిగాని వానిశౌ
ర్యోదయవృత్తి కట్టెదుర నోపర మెవ్వరు విక్రమింపఁగన్॥"

పై కారణముల నాలోచింప సర్వవిధముల శిశుపాలుఁడు రాజసూయమునందలి 'ఉదవసానీయేష్టి' యందుఁ బహువుగాన విశసింపఁబడినట్లును అది హఠాత్కృతముగాఁ జేయఁబడినట్లును స్పష్టమగుచున్నది. ధర్మజు రాజసూయము సర్వవిధములసంపూర్ణత నొందినదో యనునట్లు మద్యపాన మొకయజమానుఁడే గాక రాజసూయమునకు వచ్చినవారిలోఁ ద్రాఁగనివాఁడొక్కఁడును లేఁడని చెప్పఁబడి యున్నది. (1)

మఱియు 'కాత్యాయన'సూత్రానుసారముగా 'పునరభిషేకమునఁ' గావలసిన ద్రవ్యములలో నైదు 'పాచిక' లుండవలెను. దానికిఁ దగినట్లు ధర్మజుని పునరభిషేకమునకు 'విరాటుఁడు' బంగారుతో తాపటము చేయఁబడిన'పాచికలఁ' దెచ్చియిచ్చినట్లుకూడ వర్ణింపఁబడెను. (2)

ఇట్లే తక్కిన పునరభిషేక పరికర సంపత్తియు, అభిషేకానంతరము రాజు బంధువులచేతను సామంతులచేతను బాగడఁబడుచు రథారోహణమొనర్చి సంచరించుటయు వేదోక్తముగా వర్ణింపఁబడియున్నది. (3)

---

(1) సభాపర్వ॥ 52 అధ్యా. 48 శ్లో॥ (2) సభాపర్వ. 53 అధ్యా. 8 శ్లో॥
(3) సభాపర్వ. 53 అధ్యాయ.

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY.
Jangamwadi Math, VARANASI.
Acc. No. 4041..
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'కాత్యాయన, హిరణ్యకేశీ' సూత్రానుసారము పునరభిషేకానంతరము రాజైదుగురితో, సుహృద్ద్యూతము నొనర్పవలెనని యున్నది. ధర్మజుని పునరభిషేకానంతరమును నైదుగురు జూదగాండ్రుండిన సభలోనె సుహృద్ద్యూతము నొనర్చినట్లు కలదు. చూడుడు.

ద్యూతమునకుఁ బిలువవచ్చిన విదురునితో ధర్మజుఁడు సుహృద్ద్యూతి సభలో నే 'కితవు' లున్నా రన విదురుఁ డిట్లని యున్నాఁడు.

1 "ఓరాజా! ద్యూతమునందు మిక్కిలి నేర్పుగల (1) శకుని (2) వివింశతి (3) చిత్రసేనుఁడు (4) పురుమిత్రుఁడు (5) జయుఁడు, అనువారు కలరు."

అని చెప్పియున్నాఁడు. మఱియు యాగాంగద్యూతమున బంగరు వస్తువులనే యుపయోగింపవలయు ననియుఁ గలదు. ఈ సుహృద్ద్యూతమున రత్నములు పొదిగిన మణిహారమునే ధర్మజుఁడు తొలుతఁ బందెపుసొమ్ముగా నొడ్డియున్నాఁడు.

వేయునేల—

క. ధరణి హరిశ్చంద్రుఁడు భా।
సుర యశుఁడయి చేసె రాజసూయం బదియున్।

---

1 శ్లో॥ గాంధారరాజ శ్శకుని ర్విశాంపతే, రాజాతిదేవీ కృతహస్తో మితాక్షః వివింశతి శ్చిత్రసేన శ్చ రాజా సత్యవ్రతః పురుమిత్రో జయశ్చ॥ సభా॥ 58. అధ్యా॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సరిగా దనియే తలఁతును
సురుచిరవిభవమునఁ బొందుఁసుతు యజ్ఞముతో॥

—:0:—

# పరిశిష్టము.

రాజసూయయాగమును 'హరిశ్చంద్రుఁడు, ధర్మజుఁడు' మాత్రమే చేసినట్లు భారతపాఠకులు, పౌరాణికులు, తలంతురు.

మఱియు రాజసూయమె రాజకృత యాగములలో సర్వోత్కృష్ట యాగమనియు, అది సార్వభౌమత్వ సూచకమని యు వారితలంపు. కాని, అది సరికాదు.

రాజసూయముఁజేసి మహారాజత్వమొంది, పిమ్మట దిగ్విజయమొనర్చి యశ్వమేధముఁజేసి సమ్రాట్టు కాఁగలఁడని 'తైత్తిరీయ, ఐతరేయ' బ్రాహ్మణములవలనఁ దెలియ నగు చున్నవి.

రాజసూయముఁజేసి మహారాజత్వ మొందిన రాజుల నామములును, అశ్వమేధము నొనర్చి సామ్రాట్టులయిన రాజుల నామములును, గొన్ని మైత్రేయ బ్రాహ్మణమునఁ జెప్పఁబడి యున్నవి.

ఏఋషి సాంప్రదాయము ననుసరించి వారు రాజసూయ మొనర్చినదియు నందు సూచింపఁబడెను. ఆయంశము నిందుఁ జూపుచున్నాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| రాజసూయము నొనర్చిన రాజులు, మ హా రా జు లు. | సాంప్రదాయపు ఋషులు |
|---|---|
| 1. సుమద్యుమ్నని పుత్రుఁడగు 'విశ్వంతరుడు' | మార్గవేయుఁడగు రాముఁడు. |
| 2. పరిక్షిత్తుని పుత్రుఁడగు 'జనమేజయుఁడు' | కవషునిపుత్రుఁడగు 'తురుఁడు' |
| 3. సహదేవుని పుత్రుఁడగు 'సోమకుఁడు' | పర్వత, నారదులు |
| 4. సర్జయుని పుత్రుఁడు 'సహదేవుఁడు' | |
| 5. దేవావృధుని పుత్రుఁడు 'బభ్రువు' | |
| 6. విదర్భదేశాధిపతి 'భీముఁడు' | |
| 7. గాంధారదేశాధిపతి 'నగ్నజిత్తు' | |
| 8. అరిందముని పుత్రుఁడు 'సనశ్రుతుఁడు' | అగ్నిఋషి |
| 9. జానకుని పుత్రుఁడు 'క్రతువిదుఁడు' | |
| 10. విజవసునిపుత్రుఁడు 'సుదాసుఁడు' | వసిష్ఠుఁడు |

(1) "పై వారందఱును పై ఋషుల సాంప్రదాయముల ననుసరించి రాజసూయములఁ జేసి మహారాజు లైరి"

పై నుడువఁబడినవారిలో 'దమయంతి' తండ్రి 'భీముఁ డొకఁడు పేర్కొనఁబడెను. ఇది పౌరాణికులకుఁ గ్రొత్త. అల్లే రాజసూయమొనర్చిన ధర్మజుని నామము లేకుండుటయుఁ బౌరాణికులకు వింత.

(1) "సర్వేహైవ మహారాజా ఆసుః" వి. బ్రా.7—5.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## మఱికొన్ని విశేషములు.

మహాభాగతమున నానావిధ ధర్మములుండుటచే నది ధర్మశాస్త్రమేగాని, చరిత్రముగాదని కొందఱును. మోక్షశాస్త్రమని మఱికొందఱును, వీరకావ్యమని పెక్కండ్రును, వాదించుచుందురు. తత్తదంశములుండుటచే నట్లు భ్రమించుటకుఁ గారణములుండును. కాని యన్నియంశములు నం దిమిడియున్న వని వారు తలంపవలెను.

అధునాతనులలోఁ గొందఱు జ్యోతిర్విదులు 'కన్యారాశి'యన ద్రౌపది యనియు, వాయుదేవతాకముగాన స్వాతీనక్షత్రమన భీముఁడనియు, ఇంద్రదేవతాకమగు 'జ్యేష్ఠా'నక్షత్రమన 'అర్జునుఁ'డనియు, 'మీనరాశి' యనమత్స్యయంత్రమనియు, నేవేవియో యభూతకల్పనముల నల్లి భూమ్యాకాశములకు ముడిపెట్టుచు, భారతపురుషులగు ద్రౌపదీపాండవులు కల్పిత పురుషులనుచున్నారు. అది చారిత్రకమె కాదనుచున్నారు. ఖగోళవిషయములే యట్లు కల్పింపఁబడిన వనుచున్నారు.

అట్లయిన 'ఆకాశమునందు' కశ్యపాది ఋషి నామములతోఁ గొన్ని నక్షత్రములున్నవి. మనవాఙ్మయమునఁ గశ్యపాదిఋషుల చరిత్రము లున్నవి. ఇంతమాత్రమెకాదు. 'కశ్యపాది'ఋషిగోత్రజులమని ప్రతిదినమును త్రికాలములందును స్వగోత్రఋషిప్రవరములఁ జెప్పు విప్రులున్నారు. పాండవులవలె నీ గోత్ర ప్రవరములుగల కశ్యపాదులుకూడ మిథ్యయనియు,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'గోత్ర,' ప్రవరఖండ'లలోను, వేదములయందు నుడువఁబడిన,వసిష్ఠ, విశ్వామిత్రాదులు, ఖగోళస్థ నక్షత్రముల నూహించి, యే కవిచేతనో కల్పింపఁబడినవారనియుఁ జెప్పవలయునా ?

నక్షత్రములకు 'వాయ్వింద్రాగ్ని దేవతాకములనియు' రాసులకు, కన్యామీనాదికములనియు, భూలోకములోనివారె నామములు పెట్టియున్నారు.అవి ధీమంతుల యూహాలే కాని వేఱు కాదు. కొన్ని సంబంధములు ఖగోళమునందలి పేరులకును భారత గాథలకును కలిగినంతమాత్రమున భారతగాథలు ఖగోళశాస్త్రము ననుసరించి వ్రాయఁబడెననుట సర్వాబద్ధము. భారతము చరిత్రగ్రంథము. తత్తచ్ఛాస్త్రాంశములం దిటీవల చేర్పఁబడినవి.

## ఇంక నొకవిధమగు పరిశోధనము.

మఱికొందఱు పరిశోధకులు 'భారత' గాథలయొక్కయుఁ, తత్రస్థులగు కురుపాండవుల యొక్కయుఁ బ్రశంసలు 'వైదిక వాఙ్మయమున' నెచటను గాన్పింపవుగాన భారతగాథయుఁ దత్రస్థులగు కురుపాండవుల నామములును గల్పితములే యని చెప్పుదురు.

ఇది మిగుల విచారణీయాంశమె. కాని, వైదిక వాఙ్మయమంతయు నింకను బ్రకటితము కాలేదు. 'మైత్రాయణీయ, కఠ, కాలాప' సంహిత లిపుడిపుడే ముద్రింపఁబడుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'పైప్పలాదర' సంహితాదు లింకను ఖండాంతరములలో గుప్తప ఱుపఁబడియే యున్నవి. మఱికొన్ని నశించినట్లే కాన్పించుచు న్నవి. అట్టి యపరిశోధిత వైదిక వాఙ్మయమున నెచటనైనఁ గురుపాండవుల చరిత్రముండెనేమొ ?

'ఛాందోగ్యోపనిషత్తు' నందును 'తైత్తిరీయ కాఠకము లందును' ఇతిహాసములు, పురాణములు వేదమునకు భిన్నము లుగా నుండినట్లు చెప్పఁబడి యున్నది.

భారతగాథ 'జయము' అను నితిహాసనామముగా నుం డెనని మహాభారతముయొక్క మొదటను, కడపటను, నడుమ నుగూడఁ జెప్పఁబడెను. ఆజయేతిహాస మెట్లు పెంపఁబడెనో విపు ల ము గా ని ం త కుఁ బూ ర్వ మె వ్రా సి యు న్నా ను. వేదమునకు భిన్నమైన 'జయము' ఇతిహాసమె. అనఁగా జరిగిన నిజచరితమెకాని, కల్పితము కాదు. వేదకాలమునఁ బ్రత్యేకము గఁ బ్రచారములోనుండినవియు, ఛాందోగ్యాదులలోఁ బేర్కొ నఁబడినవియునగు నితిహాస గ్రంథములే మహాభారతమున (పెం పఁబడిన భాగమున) 'సుపర్ణ, దుష్యంత, యయాతి, నల, రామ, సావిత్రి; మరుత్తుల' యితిహాసములు. 'సుపర్ణోపాఖ్యా నము' వేదవాఙ్మయముకంటె వేఱుగనున్నదని 'ఐతరేయబ్రా హ్మణము' నందలి యీక్రింది వాక్యమువలన స్పష్టమగు చున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

1 "ఆఛందస్సులు సుపర్ణుఁడై యెగిరిన యంశమును సౌపర్ణాఖ్యానమని, ఆఖ్యానవేత్తలు చెప్పిరి"

మొదటి చరిత్రము కాలాంతరమునఁ బలువిధములుగాఁ బెరిగియుండుట లోకస్వభావమె.

మహాభారతకాలమున వాడుకలో నుండిన రామాయణ గాథ అరణ్యపర్వమునఁ జేర్పఁబడెను. తొలుత వాల్మీకి రచించిన దదియే యైయుండును. పిమ్మట ననేకములగుమార్పుల నొందినది. 'భాస్కర, రంగనాథుల' కాలమున నాంధ్రదేశమున నెట్లు రామాయణగాథలు మార్పుల నొందెనో వాల్మీకి రామాయణ గాథలను, 'భాస్కర, రంగనాథుల' రామాయణములలోని గాథలను బరిశీలనముతోఁ బఠించినవారికి విశదము కాఁగలదు.

మఱియు 'పాణిన్యాచార్యుఁడు' వైదికఋషియే. ఆతనికాలమునకు భారతగాథ ప్రచారములో నుండుటయే గాక 'వాసుదేవార్జునుల'యందు, ఇతర క్షత్రియులకంటె నెక్కుడు భక్తితత్పరులై యున్నారని సూచించి యున్నాఁడు. 2

మఱియు 'యుధిష్ఠిర, నకులాదులు'ను బురాణ పురుషులనుగాఁ బేర్కొనియున్నాఁడు.

ఇంకను గ్రీస్తునకుఁ బూర్వమున నేడవ శతాబ్దమున

---

1 'తేయత్సు పర్ణో భూత్వోదపదం తదేతత్సౌపర్ణమిత్యాఖ్యాన విద ఆచక్షతే॥
ఐ. బ్రా. 3—3—25.

2 సూ॥ మహారాజా ట్ఠఇన్॥ 4—3—97, వాసుదేవార్జు నాభ్యాంవున్॥ 4—3—98. గోత్ర క్షత్రియా ఖ్యేభ్యోబహుళంవున్॥ 4—3—99.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుండిన ఉదయన మహారాజు పాండవ వంశస్థుఁడని యిప్పటికి రెండు వేల వత్సరములకుఁ బూర్వముననుండిన 'భాసుఁడు'ను ఇంచుమించుగ నాకాలముననే బయలువెడలిన కథాసరిత్సాగర గ్రంథకర్తయుఁ జెప్పియున్నారు. చాళుక్యులు తాము పాండవ వంశస్థులమని చెప్పుకొని యున్నారు. ఇట్లుండగా భారతగాథ యుఁ దత్రిస్థకురుపాండవులును నెట్లు కల్పింపఁబడి యుందురని చెప్పనలయును ? దృశ్యమాన వైదిక వాఙ్మయమున షట్చక్రవర్తులలో హరిశ్చంద్రుఁడుగాక తక్కిన చక్రవర్తులును, షోడశ మహారాజులలోఁ బెక్కండ్రును బేర్కొనఁ బడలేదు. కాన వారందఱి చరితములును సంపూర్ణముగా మిథ్యలేనా? కొన్నియైన నుండవా ? కాన భారతేతిహాసము సంపూర్ణముగా మిథ్య యనరాదు. కొంతమాత్రము కల్పితమైనది. పాండవులు కల్పిత పురుషులు కారు.

### 'జయ'మున రాజసూయమునేల చెప్పలేదు ?

ఇతిహాసములలో వైదిక కర్మాంశములుండవు. ఇందుల కు వైదిక వాఙ్మయమునఁ బేర్కొనఁబడిన 'సువర్ణోపాఖ్యానము, నలునిచరిత్రమునఁ గాన్పించు భీముని చరితము, పురాణముల లోఁ బేర్కొనఁబడిన హరిశ్చంద్రోపాఖ్యానములే నిదర్శనములు. పై యితిహాసములలో 'సోమాహరణ, రాజసూయ యాగ' కర్తృత్వము లెట్లు పేర్కొనఁ బడలేదో, అట్లే తొలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కురుపాండవ చరితమగు 'జయము' అను నితిహాసముననుజెప్పఁ బడలేదు. రెండవసారి పెంపఁబడిన సంపూర్ణ చరితమగు (వైశంపాయనకృతము) భారతమున, శిశుపాలుఁడు పశువుగాఁ జేయఁబడినట్టిదియు,యజ్ఞమున కాటంకము లేకుండగఁ దొలుతనే చేయఁబడిన జరాసంధ వధముతోఁగూడినట్టిదియు, నగు రాజసూయము స్పష్టీకరింపఁబడెను.

భారతమును పంచమ వేదముగాఁ జేయు తలంపుగల 'సౌతి' రాజసూయమునందలి వైదిక కర్మాంశములఁ బూర్తిగ నా యితిహాసములో నిమిడిచియున్నాఁడు.

పై కారణములచే భారతగాథ సత్యమైన చరిత్రమనియు, ధర్మజుఁడు రాజసూయ మొనర్చుటయు, నందు శిశుపాలుఁడు పశువుగా వధింపఁబడుటయు నిశ్చయములని, దృఢముగా వ్రాయఁ గలుగుచున్నాను.

ఇది శ్రీ కౌండిన్యగోత్రపవిత్రుఁడును, పెండ్యాలవంశజుఁడును, రామాంబా వేంకయాహ్వయుల ప్రథమపుత్రుఁడును, 'వ్యవసాయ, మహాభారత, పరిక్షిచ్చరిత్రాది' బహుగ్రంథకర్తయు నగు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిచే రచింపఁబడిన 'రాజసూయ రహస్యము' నందు ద్వితీయభాగము.

సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

JAGADGURU VISHWARADHYANA SIMHASAN JNANAMANDIR LIBRARY.
Jangamwadi Math, VARANASI,
Acc. No. 7412
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కౌండిన్యనిలయమున లభించుపుస్తకములు

| | పోస్టేజికాక, వెల. రు. అ. పై. |
|---|---|
| (1) రాజసూయరహస్యము:— ఇది వేదములను, భారతమును శోధించి హరిశ్చంద్ర ధర్మరాజుల రాజసూయములఁగూర్చి వ్రాయఁబడిన విమర్శన గ్రంథము. | 1—0—0 |
| (2) పరిక్షిత్తు:— ఇది వేదములను, పురాణములను క్రోడీకరించి వ్రాయబడిన గద్యకావ్యము. | 0—12—0 |
| (3) మహాభారతచరిత్ర:— ఇది ఆంధ్రదేశమునం దంతటను ప్రసిద్ధికెక్కిన విమర్శనగ్రంథము. దీనినిగూర్చి 'స్కాట్లండు'నుండి ఎ. బి. కీతు పండితుఁ వ్రాసియుండెను. | 1—12—0 |


**University of Edinburgh.**

24—1—34

Dear Sir,

I am much obliged to you for sending me your work in Telugu on the development of the Mahabharata. I gather from the English synopsis which you have supplied that you have presented to your fellow-countrymen modern views of the process of evolution of that text. It is clear that much and prolonged study will be required before these issues can be elucidated, and I have no doubt that your discussion will be helpful in attracting attention to these difficult problems. So far as I follow your position, you seem to realise clearly the essential difficulties presented by the present narration and the solution which lies in the gradual transformation of the Kaurava epic to fovour the incoming Pandava.

*Yours very truly,*

(Sd) A. B. Keith; D. Lit.

(True copy.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri